ఆంధ్రప్రదేశ్

# పంచాయతీ సమితుల, జిల్లాపరిషత్తుల చట్టము.

# 1959

(1959 వ 35 వ నెం॥ చట్టము)



అనువాదకులు :

శ్రీ జె. వెంకట కృష్ణశర్మ, బి. యస్ సి., బి. యల్.,
హైకోర్టు అడ్వొకేటు - హైదరాబాదు. (ఆ. ప్ర.)



ప్రకాశకులు :

జయ భారత్ బుక్ డిపో
పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్,
ఆర్యసమాజ మందిర్ - సుల్తాన్ బజార్,
హైదరాబాదు - ఆంధ్ర ప్రదేశ్.

వెల. 90 న. పై.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ స్థానిక స్వపరిపాలనాశాఖ వారిచే
తెనుగు, ఉరుదు అనువాదమునకు అనుమతింపబడినది

**G. O. Ms. No. 1212**

Dated 9—12—1959

అమరావతి ప్రెస్,
హైద్రాబాదు.

# విషయ సూచిక

## 1 వ అధ్యాయము

### ఆరంభము


| | పేజీ |
|---|---|
| సంక్షిప్త శీర్షిక, విస్తృతి, ప్రారంభము | 1 |
| నిర్వచనములు | 2 |


## 2 వ అధ్యాయము


| | |
|---|---|
| పంచాయతీ సమితుల స్థాపన-వాని సంఘీకరణ | 4 |
| పంచాయతీ సమితి నిర్మాణము | 5 |
| కొందరు అసెంబ్లీ సభ్యులు, పంచాయతీ సమితి స్థాయీ సమితి వ్యవహారములలో పాల్గొనుటకుగల హక్కు | 7 |
| సభ్యులను ఎన్నుకొనుటకు ప్రత్యేక సమావేశము | 7 |
| పంచాయతీ సమితి అధ్యక్ష ఉపాధ్యక్షుల ఎన్నిక పదవీ కాలపరిమితి. ఖాళీలను భర్తీచేయుట | 8 |
| పంచాయతీ సభ్యుల కాలపరిమితి, ఖాళీలు భర్తీచేయుట | 9 |
| సభ్యుడగుటకు అనర్హతలు | 11 |
| సభ్యుడుగా వుండుటకు అనర్హతలు | 12 |
| సభ్యులయొక్క అనర్హతల సమస్యలను జిల్లా మునసబు నిర్ణయించుట | 12 |
| కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను, పూర్తిచేయుట | 13 |
| అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, లేక సభ్యుని రాజీనామాలు | 13 |
| పంచాయతీ సమితుల స్థాయీసమితులు | 14 |
| పంచాయతీ సమితి లేక స్థాయీసమితి వ్యవహారములలో కలెక్టరు పాల్గొనుటకుగల హక్కులు | 16 |
| తన స్థాయీసమితుల నుండి రికార్డులను తెప్పించు కొనుటకు పంచాయతీకిగల అధికారము | 16 |
| పంచాయతీ సమితి, స్థాయీసమితుల సమావేశపు వ్యవహార నిర్వహణకొరకు చేసిన నిబంధనలు | 16 |

18. పంచాయతీ సమితియొక్క అధికారముచేయు పనులు 17

19. జాయింటుగా వుండే నీటివసతులు, మరియు యితర సంస్థల యొక్క నిర్వహణ కార్యములు 18

20. బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు వద్దనుండి రికార్డులను తెప్పించుకొనుటకు పంచాయతీ సమితులు, లేక దాని స్థాయీసమితులకు అధికారములు 19

21. పంచాయతీ సమితులకు గ్రామాధికారులనుండి సమాచారము తెప్పించుటకుగల అధికారము 19

22. అధ్యక్షుని ఉపాధ్యక్షుని అధికారములు, కర్తవ్యములు 19

23. ఇతర సభ్యులు పంచాయితీ సమితి పనులు మొ॥ వానిని గూర్చి ఎంచిచూపే హక్కు 21

24. బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరుయొక్క అధికారములు, కర్తవ్యములు 21

25. బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు మరియు ఇతర అధికారులు మరియు పంచాయితీ సమితి సిబ్బందియు, పంచాయితీ సమితి తాబేదారులు 24

26. అధికారులయు, తదితర ఉద్యోగస్థుల పదవులను సృష్టించుట, నియామకములు 24

27. పంచాయితీ సమితియొక్క లేక దాని స్థాయీసమితుల యొక్క సమావేశములకు హాజరగుట భత్యములు 24

28. పంచాయితీ సమితి నిధి 25

29. పంచాయితీ సమితియొక్క ఆదాయ వ్యయములు 25

30. పంచాయితీ సమితియొక్క బడ్జెటు 26

31. పంచాయితీలు మరియు పట్టణ సమితులు, వాట్ల బడ్జెట్లను పంచాయతి సమితులకు సమర్పించుట 27

32. అకౌంట్లు - ఆడిటు 27

33. అధ్యక్షునిపై లేదా ఉపాధ్యక్షునిపై అవిశ్వాస తీర్మానము 30

34. ప్రభుత్వమునకు, పంచాయతీ సమితి అధ్యక్షునిగాని ఉపాధ్యక్షునిగాని తొలగించుటకు అధికారము 33

35. పంచాయతీ సమితి మరియు స్థానిక అధికారుల జాయింటుసభ 33

## 3 వ అధ్యాయము


36. జిల్లాపరిషత్తుల స్థాపన. సంఘీకరణ, నిర్మాణము 34
37. జిల్లాపరిషత్తు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నికలు - పదవి కాలము ఖాళీలు భర్తీచేయుట 36
38. జిల్లా పరిషత్తు కార్యదర్శి 37
39. జిల్లా పరిషత్తు సభ్యుల పదవీకాలము. ఖాళీలను భర్తీచేయుట 37
40. అనర్హతలు 33
41. కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను నింపుట 38
42. అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని లేక సభ్యుని రాజీనామా 39
43. జిల్లా పరిషత్తుయొక్క స్థాయీసమితులు 39
44. కొందరు జిల్లా అధికారులకు జిల్లా పరిషత్తు యొక్కగాని దాని స్థాయీ సమితియొక్కగాని ప్రొసీడింగులలో పాల్గొనుటకు హక్కు 41
45. జిల్లా పరిషత్తుయొక్క లేదా దాని స్థాయీ సమితియొక్క సమావేశములో వ్యవహారము జరుపుకొనుటకు నియమములు 42
46. జిల్లా పరిషత్తుగాని స్థాయీ సమితిగాని దాని కార్యదర్శి వద్దనుండి రికార్డులను తెప్పించుకొనే అధికారము 32
47. జిల్లా పరిషత్తుయొక్క అధికారములు, కర్తవ్యములు 42
48. జిల్లా పరిషత్తు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని అధికారములు కర్తవ్యములు 44
49. జిల్లా పరిషత్తు కార్యముల విషయములలో సూచించుటకు నిడిసభ్యుల హక్కులు 46
50. జిల్లా కలెక్టరుయొక్క అత్యవసర అధికారములు 46
51. అధికారులయొక్కయు ఇతర ఉద్యోగులయొక్కయు, పదవులను సృష్టించుట, ఆ పదవులలో నియామకములు చేయుట మున్నగునవి 46
52. జిలా పరిషత్తు, దాని స్థాయీ సమితియొక్క సభ్యుల బతెములు 47
53. జిల్లా పరిషత్తు నిధి 47
54. జిల్లా పరిషత్తుయొక్క ఆదాయ వ్యయములు 49
55. జిల్లా పరిషత్తు బడ్జెటు 49
56. అక్కౌంట్లు-ఆడిట్లు 50

57. జిల్లా పరిషత్తు అధ్యక్షునిపైగాని ఉపాధ్యక్షునిపైగాని అవిశ్వాస తీర్మానం 50

58. జిల్లా పరిషత్ అధ్యక్షుని, ఉపాధ్యక్షుని తొలగించుటకు ప్రభుత్వమువారి అధికారము 50

## 4 వ అధ్యాయము

59. జిల్లా బోర్డులో అధికారములను, కర్తవ్యములను పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు బదిలీచేయుట 51

60. జిల్లాబోర్డు రద్దుచేయుట 52

61. సంబంధించిన జిల్లాబోర్డుల చట్టము, పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు వర్తించుట 53

62. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు తీర్మానమును రద్దు చేయుటకు లేక తాత్కాలికముగా ఆపియుంచుటకు అధికారము 53

63. పంచాయతీ సమితిని, జిల్లాపరిషత్తునుగాని రద్దుచేయుట విఘటన చేయుటకుగాని ప్రభుత్వముయొక్క అధికారము 53

64. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు చర్యలు లాంఛన ప్రకారముగా యుండకపోవుట - ఖాళీలు ఏర్పడుటవలన చెల్లనవిగా యుండవు 56

65. సభ్యులు తీసుకొనవలసిన ప్రమాణము 56

66. పరిపాలనా నివేదిక 57

67. తనిఖీచేయు అధికారుల ప్రవేశమునకు అధికారములు 58

68. సద్భావముతో చేయబడిన చర్యల విషయమున రక్షణ 58

69. నియమములనుచేయు అధికారము 59

70. పంచాయతీ సమితికి జిల్లా పరిషత్తుకు ఉప నిబంధనల చేయు అధికారము 59

71. అధికారప్రదానము, సంస్థలను, పనులను బదిలీచేయుటకు అధికారము 59

72. ప్రభుత్వమునకు మార్పుచేయుటకు, సమీక్షించుటకు అధికారము 60

73. ఇబ్బందులను, తొలగించు అధికారము 61

74. తాత్కాలిక పంచాయతీ సమితుల సందర్భములలో మినహాయింపు 62

# ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము 1959.

---

## (1959 వ సంవత్సరపు నెం॥ 35 వ చట్టము)

(1959 సెప్టెంబరు 18 వ తారీఖున గవర్నరు అనుమతి పొందుట అయినది.)

(18 సెప్టెంబరు 1959 తారీఖు, ఆంధ్ర ప్రదేశ్ గెజెట్ పార్టు IV (బి) ఎక్స్ట్రార్డినరీలో ప్రచురించబడినది.)

జిల్లా పరిషత్తుల పంచాయితీ సమితుల వాటికి సంబంధించిన యితర విషయముల ఏర్పాటులకు చేయబడిన చట్టము. ఈ చట్టము ఆంధ్ర ప్రదేశ్ శాసన సభ చేత 10 వ స్వతంత్ర సంవత్సరమున, చట్టముగా చేయబడినట్లు పరిగణింప బడవలయును:—

## 1 వ అధ్యాయము

### ఆరంభము

సంక్షిప్త శీర్షిక, విస్తృతి, ప్రారంభము.

**1** 1. ఈ చట్టము 1959 సంవత్సరపు ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితులు మరియు జిల్లా పరిషత్తుల చట్టము అని పిలువబడ వచ్చును.

2. ఈ చట్టము ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రము మొత్తమునకు వర్తించును.

3. ఈ చట్టము ఆంధ్ర ప్రదేశ్ గెజెట్‌లో రాష్ట్ర ప్రభుత్వముచే తెలియచేయబడు నిర్ణీత స్థలములలో, నిర్ణీత తేదీలనుండి అమలులోకి రాగలదు.

వారు దీనిలో వివిధ విషయములు, వివిధ ప్రదేశములలో అమలు జరుపుటకు వివిధ తేదీలు నిర్ణయించ వచ్చును.

## నిర్వచనములు.

**2** ఈ చట్టములో సందర్భము వ్యతిరేకముగా చెప్పబడ వలసి వస్తే తప్ప నిర్వచనములు ఈ క్రింది విధముగా యుండవలయును.

(ఏ) "ఆంధ్రప్రాంతము" అనగా 1959 ఆంధ్రస్టేటు చట్టము (కేంద్ర చట్టము 30 యొక్క 1953) 3వ సెక్షనులో 1వ సబ్ సెక్షనులో ఉదహరింప బడిన ప్రాంతము;

(బి) "బ్లాకు" అనగా ప్రభుత్వముచే "బ్లాకు"గా అధికారముగా ప్రకటించబడే ఒక జిల్లాలోని నిర్ణీత ప్రాంతము;

(సి) "బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్", అనగా ప్రభుత్వము వారిచేత గాని ప్రభుత్వమువారిచే అనుమతింపబడిన ఏ అధికారిచేతనైనగాని ఆ హోదాతో నిర్ణయింపబడిన ఉద్యోగి;

(డి) "కలెక్టరు", అనగా ఒక రెవిన్యూజిల్లామీద ఆధిపత్యముకల్గిన అధికారి, మరియు డిప్యూటీకలెక్టరు, సబ్‌కలెక్టరు, అసిస్టెంటు కలెక్టరుకూడ కలెక్టరుగా పరిగణింప బడవచ్చును;

(ఇ) "ప్రభుత్వము" అనగా రాష్ట్ర ప్రభుత్వము;

(యఫ్) "నోటిఫికేషన్" (తెలియచేయబడుట) అనగా ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రచురణద్వారా తెలియచేయబడుట;

(జి) "పంచాయత్" అనగా ఆంధ్ర ప్రాంతములో 1950 మదరాసు గ్రామ పంచాయతీలచట్టము (మదరాసు చట్టము 1950 యొక్క 10వ) ప్రకారము ఏర్పరచబడిన పంచాయతీ; తెలంగాణ ప్రాంతములో 1956 హైద్రాబాదు గ్రామ పంచాయతీలచట్టము (హైద్రాబాదు చట్టము 1956 యొక్క 17వ) ప్రకారము ఏర్పరచబడిన గ్రామపంచాయతీ;

(హెచ్) "పంచాయతీసమితి" అనగా 3వ సెక్షను ప్రకారము ఏర్పరచ బడిన పంచాయతీ సమితి;

(ఐ) ''నియమింపబడిన" అనగా ఈ చట్టముక్రింద చేయబడిన నిబంధనల ప్రకారము నియమింపబడినది;

(జె) ''సంబంధించిన జిల్లాబోర్డుచట్టము" అనగా ఆంధ్ర ప్రాంతమునకు 1920 మదరాసు జిల్లాబోర్డుచట్టము (మద్రాసు చట్టము 1920 యొక్క 14వ) తెలంగాణ ప్రాంతమునకు 1955 జిల్లాబోర్డుచట్టము (హైద్రాబాదు చట్టము 1956 యొక్క 1వ);

(కె) "నిమ్నతెగలు'' మరియు ''నిమ్నజాతులు''కు ఇండియా రాజ్యాంగ చట్టములో 366 ఆర్టికల్‌లో 24, 25 క్లాజులలో ఇవ్వబడిన అర్థమే వుండవలెను;

(యల్) "రాష్ట్రము'' అనగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము:

(యమ్) ''తెలంగాణ ప్రాంతము'' అనగా 1956 రాష్ట్ర విభజనచట్టము (కేంద్ర చట్టము 1956 యొక్క 37వ)లో 3వ సెక్షనుయొక్క 1వ సబ్‌సెక్షనులో ఉదహరింపబడిన ప్రాంతములు;

(యన్) ''పట్టణ సమితి'' అనగా 1956 హైద్రాబాదు పురపాలక చట్టము హైద్రాబాదు చట్టము 1956 యొక్క 18వ) 5వ సెక్షన్ ప్రకారము నియమింపబడిన పట్టణ పాలకసభ;

(ఓ) ''జిల్లాపరిషత్తు'' అనగా 36వ సెక్షనుప్రకారము నియమింపబడిన జిల్లాపరిషత్తు;

(పి) ఈ చట్టములో ఉపయోగించబడిన అనిర్వచన విధములు, ప్రయోగములకు ఆయా సంబంధించిన జిల్లాబోర్డు చట్టములోను, రాష్ట్రములలో అమలులో వున్న, పురపాలక పంచాయతీలకు సంబంధించిన శాసనములో నిర్దేశించిన అర్ధములే ఉండవలయును.

# 2 వ అధ్యాయము

పంచాయతీ సమితుల స్థాపన, సంఘీకరణ, నిర్మాణము, అధికారములు; కర్తవ్యములు మొదలగునవి.

## పంచాయతీ సమితుల స్థాపన, వాని సంఘీకరణ

**3** 1 ప్రభుత్వము, ప్రకటనద్వారాదానిలో నిర్దేశింపబడినతేదీ లగాయతూ, ఒక బ్లాకుకొరకు ఒక పంచాయతీ సమితిని స్థాపించవచ్చును.

2 ప్రతి పంచాయతీ సమితియును, ఏ బ్లాకుకై స్థాపింపబడినదో ఆబ్లాకు పేరుతో ఒక సంఘీభూత సంస్థగాఉండును. దానికి నిరంతర వృత్తరాధికారమును, సమిష్టిముద్రయును, ఆస్థిని సంపాదించుకొనుటకు, కూడ బెట్టుకొనుటకు, పరిష్కరించు అధికారములును, ఖరారుచేసుకొను అధికారమును కలిగియుండును. దాని సంస్థపేరుతో (అది) దావాచేయవచ్చును, లేక (దానిమీద) దావా వేయబడ వచ్చును.

3 పంచాయతీ 3వ సెక్షన్ 1వ సబ్‌సెక్షను క్రింద ఒక బ్లాకుగా స్థాపింపబడిన తరువాత ఆ బ్లాకుయొక్క సరిహద్దులు తిరిగి మార్పుచేయబడిన యెడల ప్రభుత్వమువారు అట్టితిరిగి మార్పుచేయబడిన బ్లాకుసుగాను అట్టి సబ్‌సెక్షన్ నిబంధన ననుసరించి పంచాయతీ సమితిని తిరిగి స్థాపించవచ్చును.

అయితే, పంచాయతీ సమితిని తిరిగి స్థాపించుటలో ప్రభుత్వమువారు అట్లు సరిహద్దు మార్పుచేయుటకు అంతకు ముందు పనిచేయుచున్న పంచాయతీ సమితియొక్క అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, సహసభ్యుడుగా చేర్చుకొన బడిన సభ్యుడు లేక నామనిశ్చయము చేయబడిన సభ్యుడు ఆయన, తిరిగిస్థాపింప బడిన పంచాయతీ సమితిలో అట్టిపదవియందు వుండుటకు ఇతర విధముగా అర్హుడై యున్నపుడు, తిరిగి స్థాపింపబడిన పంచాయతీ సమితిలో, అట్టిపదవికి ఆయన సందర్భాను సారముగా ఎన్నుకొనబడితే, సహ సభ్యుడుగా వేసికొన బడితే, లేక నామ నిశ్చయము చేయబడితే, ఎట్లో అట్లే ఆయన తిరిగి స్థాపింప బడిన పంచాయతీ సమితి యొక్క అధ్యక్షుడుగా, ఉపాధ్యక్షుడుగా, సహ

సభ్యుడుగా, వేసికొనబడిన సభ్యుడుగా, లేక నామ నిశ్చయముచేయ బడిన సభ్యుడుగా ఉండవలెనని ఆదేశించ వచ్చును.

## పంచాయతీ సమితి నిర్మాణము:-

4 1 ప్రతి పంచాయతీ సమితియున్నూ, ఈ క్రింది సభ్యులను కూడి యుండవలెను:—

i పదవి రీత్యా ఆంధ్ర ప్రాంతములో ప్రతి పంచాయతీ అధ్యక్షుడును, తెలంగాణా ప్రాంతములో ప్రతి పంచాయతీ సర్పంచియును, మరియు ప్రతి పట్టణ సమితి అధ్యక్షుడును;

అయితే—

(ఎ) రాష్ట్రములో ప్రస్తుతము అమలులో నున్న పంచాయితీల, పట్టణ మునిసిపాలిటీలకు సంబంధించిన శాసనములలో ఏమి ఉన్నప్పటికిన్నీ పంచాయతీయొక్క ఏ అధ్యక్షుడుగాని, సర్పంచిగాని, పట్టణసమితి అధ్యక్షుడుగాని, పంచాయతీ సమితి సభ్యుడుగా నుండ నిరాకరించినచో, లేక అట్టి సభ్యత్వమునకు రాజీనామా ఇచ్చినచో, లేక ఇతరత్రా అట్టి సభ్యుడుగా నుండుటకు వీలుపడనిచో, అట్టి నిరాకరణ, రాజీనామా, విరమణ తేదీ మొదలుకొని సందర్భాను సారముగా, పంచాయతీ అధ్యక్షుడుగా గాని, సర్పంచిగా గాని, పట్టణ సమితి అధ్యక్షుడుగా గాని ఉండరాదు. మరియు అట్టి పదవిలో ఆయన అనంతరము వచ్చిన వ్యక్తి ఆయన స్థానములో పంచాయతీ సమితిలో సభ్యుడుగా ఉండవలెను.

(బి) ఏదైనను ఒక పంచాయతీ లేక పట్టణ సమితి రద్దుచేయబడినపుడు గాని, విఘటన చేయబడినపుడు గాని, అట్టిస్థానమునకు అట్టి పంచాయతీయొక్కగాని, పట్టణ సమితియొక్కగాని నిర్దేశ ప్రాంతమందు నివసించు వానిని, ఆ ప్రాంతమునకు ప్రాతినిధ్యము వహించు సభ్యుడుగా ఆ జిల్లా కలెక్టరు నామ నిశ్చయము చేయవలెను.

ii ఒక పంచాయతీ లేక పట్టణ సమితియొక్క అధికార ప్రాంత ములో చేరనిదై యుండి, పంచాయతీ స్థాపనకు వీలుగానుండునట్లు పరిపాలనా శాఖ ఇనస్పెక్టరు జనరలుచేత నిర్దేశింపబడిన ప్రతి ప్రాంతమునకు, ఆ ప్రాంత మందు నివశించు, ఆ ప్రాంతమునకు ప్రాతినిధ్యమువహించు సభ్యుడుగా జిల్లా కలెక్టరుచేత నామనిశ్చయము చేయబడిన ఒక వ్యక్తి.

iii ఈ క్రింద నుదహరించిన వ్యక్తులు ఆ బ్లాకులో నివసించు వ్యక్తులలోనుండి, 1, 2 క్లాజులలో నిర్దేశింపబడిన సభ్యులు నిర్ణయింపబడిన ప్రకారముగ సహసభ్యులుగా వేసికొనవలెను.

(ఎ) ఒక స్త్రీ.

(బి) షెడ్యూల్డు కులముయొక్క లేక షెడ్యూల్డు తెగలయొక్క ఒక ప్రతినిధి.

(సి) షెడ్యూల్డు తెగలయొక్క ఒక ప్రతినిధి; దీనికి ఆ జిల్లాకలెక్టరు గత జనాభా అంకెలఆధారముగా, ఆబ్లాకులోని మొత్తము జనాభాలో నిర్ణయించబడిన శాతముకన్న తక్కువలేదని ప్రకటించినపుడు, మరియు అట్టి షెడ్యూల్డు తెగల జనాభా అట్టి శాతముకన్న తగ్గియున్నపుడు షెడ్యూల్డు కులములోని మరియొక ప్రతినిధి;

(డి) పరిపాలన, ప్రజాజీవనము, గ్రామీణ అభివృద్ధిలో లేక సంఘ సేవలో అనుభవముగల ఇద్దరు వ్యక్తులు; మరియు

(ఇ) ఆ బ్లాకులో పనిచేయుచున్న ఒక సహకారసంఘముయొక్క ఒక సభ్యుడు;

2 ఈ సెక్షను, మరియు 36 వ సెక్షనుల నిమిత్తము ఒకవ్యక్తి ఒక బ్లాకులోగాని, ఒక ప్రాంతములోగాని సాధారణముగా నివసించుచూ ఉండిగాని, లేక ఆబ్లాకులోగాని, ఆప్రాంతములోగాని, స్వంత నివాసగృహము కలిగియుండిగాని ఉన్నయెడల ఆవ్యక్తి ఆబ్లాకులోగాని, సందర్భానుసారముగా ఆ ప్రాంతములోగాని నివసించుచున్నట్లుగా పరిగణింపబడవలెను.

## కొందరు అసెంబ్లీసభ్యులు, పంచాయితీ సమితి స్థాయీ సమితి వ్యవహారములలో పాల్గొనుటకు గలహక్కు

**5** 1 రాష్ట్రశాసనసభ్యుడు తాను ప్రాతినిధ్యమువహించు నియోజకవర్గములో ఏర్పడిన బ్లాకుయొక్క పంచాయితీసమితిలో సభ్యుడుకానప్పుడు, ఆ సమితియొక్క ఏసమావేశములోనైనను మాట్లాడుటకును, దానివ్యవహారముల లో సక్రమముగా పాల్గొనుటకును హక్కుకలిగియుండును. కాని ఈ సబ్ సెక్షను ప్రకారము అట్టి ఏసమావేశములోను ఓటుచేయుటకు హక్కుకలిగియుం డడు. అట్టి నియోజకవర్గములో ఒకటికన్న ఎక్కువ బ్లాకులు కలిగియున్నపుడు అతనికి అట్లు స్థాపించబడిన ప్రతిబ్లాకులోని ప్రతి పంచాయతిసమితిలోను పాల్గొను హక్కుగలదు. ఏదైనను ఒకబ్లాకు ఒకటికన్న ఎక్కువ అట్టి నియోజకవర్గములో ఉండినపుడు, అట్టి ప్రతి నియోజకవర్గమునకు ప్రాతినిధ్యము వహించు ప్రతిసభ్యునకు, ఆబ్లాకులో స్థాపించబడిన పంచాయతీసమితియొక్క అట్టి హక్కును కలిగియుండును.

2 రాష్ట్రప్రభుత్వమువారిచే ఉత్తర్వుద్వారా నిర్దేశించబడిన లెజిస్లేటివు కౌన్సిలు సభ్యులు, ఆ ఉత్తర్వులో నిర్దేశించబడిన పంచాయతీసమితుల విషయములలో ఒకటవక్లాజులో ఇవ్వబడిన హక్కు కలిగియుండును.

## సభ్యులను ఎన్నుకొనుటకు ప్రత్యేక సమావేశము

**6** కలెక్టరు మూడవసెక్షనులో పంచాయతీ సమితిని ఏర్పాటుచేయబడిన తేదీకి ముందు ఒకతేదీని, లేక మూడవ సెక్షనులో మూడవ సబ్ సెక్షనుకు లోబడి పంచాయతీ సమితిని తిరిగిస్థాపించబడిన ప్రతి సమయములోను పంచాయతీ సమితి కార్యాలయమునందు నిర్ణీత సమయమున నాల్గవ సెక్షను, ఒకటవ సబ్ సెక్షను, ఒకటి, రెండు క్లాజులలో నిర్దేశించిన పంచాయతీ సమితి సభ్యుల ప్రత్యేక సమావేశమును, ఆ సబ్ సెక్షనుయొక్క మూడవ క్లాజులో తెలిపిన ప్రకారము కనీసము పది పూర్తిరోజులముందు ఆ సమావేశమును గురించి వ్రాత పూర్వకమైన నోటీసు అందజేయవలెను.

2 కలెక్టరుగాని, కలెక్టరుచే అధికార మీయబడిన ప్రభుత్వమువారి ఏ గెజిటెడ్ అధికారిగాని అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

## పంచాయతీ సమితి అధ్యక్ష, ఉపాధ్యక్షుల ఎన్నిక, పదవీ కాలపరిమితి, ఖాళీలను భర్తీచేయుట:-

7 1 ప్రతి పంచాయితీ సమితికిన్నీ ఒక అధ్యక్షుడును, ఒక ఉపాధ్యక్షుడును ఉండవలెను. వీరిని పంచాయతీ సమితి సభ్యులు తమలోనుండి యే ఎన్నుకోనవలెను.

కాని 4 వ సెక్షను, 1 వ సబ్ సెక్షనులో 1, 2 వ క్లాజులకు చేర్పబడిన షరతు యొక్క క్లాజు 'బి' క్రింద నామ నిశ్చయము చేయబడిన సభ్యుని మాత్రము, అధ్యక్షుడుగా గాని, ఉపాధ్యక్షుడుగా గాని ఎన్నుకొన గూడదు.

2 4 వ సెక్షను, 1 వ సబ్ సెక్షను, 3 వ క్లాజును అనుసరించి, సభ్యుల ఎలక్షన్ అయిన వెంటనే కలెక్టరు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నుకొనగలందులకు పంచాయతీ సమావేశమును ఏర్పాటుచేయవలెను. ముందుగా అధ్యక్షుడును, తరువాత ఉపాధ్యక్షుడును ఎన్నుకొనబడ వలెను. అధ్యక్షుని ఎన్నికకు కలెక్టరు, లేక జిల్లా కలెక్టరుచే దీనికొరకు అధికారమీయబడిన ప్రభుత్వమువారి ఏ గెజిటెడ్ అధికారిగాని ఎన్నికల సమావేశమునకు అధ్యక్షత వహించవలెను. ఉపాధ్యక్షుని ఎన్నికకు అధ్యక్షుడు ఎన్నిక సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

3 (ఎ) అధ్యక్షుని పదవిలో ఆకస్మిక ఖాళీ భర్తీచేయుటకు కలెక్టరు చేత పంచాయతీ సమితి సమావేశము ఏర్పాటుచేయబడి, నిర్ణయింపబడిన విధముగా ఎన్నిక జరిపింప బడవలెను. అట్టి సమావేశమునకు కలెక్టరుగాని, కలెక్టరుచే దీని కొరకు అధికారమీయబడిన ప్రభుత్వమువారి ఏ గెజిటెడ్ అధికారిగాని అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

(బి) ఉపాధ్యక్షుని పదవిలో అకస్మాత్తుగా ఏర్పడిన ఖాళీని నింపుటకు అధ్యక్షునిచేత పంచాయితీ సమితియొక్క సమావేశము ఏర్పాటుచేయబడి, నిర్ణయింపబడిన విధముగా ఎన్నిక జరుపబడవలెను. అట్టి సమావేశమునకు అధ్యక్షుడు అధ్యక్షత వహించవలెను.

4 ఈచట్టములో అన్యథా ఏర్పాటు చేయబడియున్ననేతప్ప, అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని పదవీకాలము ఆయన ఎన్నిక అయినతేదీనుండి మూడు సంవత్సరములపాటు ఉండవలెను. అధ్యక్షుని, లేక ఉపాధ్యక్షుని పదవులలో ఆ కాలపరిమితి ముగియుటకు ముందుగానే, ఆపదవిలో ఖాళీఏర్పడినయెడల, అధ్యక్షుడుగాగాని, ఉపాధ్యక్షుడుగాగాని, ఆఖాళీలలో ఎన్నుకొనబడిన వ్యక్తి, అతని పూర్వాధికారియొక్క కాల పరిమితిలో శేషించిన కాలమునకు పదవిలో ఉండవలెను.

అయితే ప్రభుత్వము వారు ప్రకటనద్వారా దానిలో చెప్పబడవలసిన తగిన కారణమువలన అధ్యక్షుని, లేక ఉపాధ్యక్షునియొక్క పదవీకాలమును ఆ ప్రకటనలో నిర్ణయింపబడు తేదీవరకు పొడిగింపబడుటకు ఆదేశింపవచ్చును. కాని అట్టితేదీ ఈ సబ్ సెక్షనుక్రింద అంతమగు తేదీనుండి 6 నెలలు మించరాదు. మరియు ప్రభుత్వము ప్రతిసారీ ప్రకటనద్వారా పైన చెప్పబడిన 6 నెలల కాలములో ఒకతేదీకి బదులు ఇంకొక తేదీకి మార్చవచ్చును.

## పంచాయితీ సమితి సభ్యుల కాలపరిమితి, ఖాళీలు భర్తీచేయుట

**8** 1 ఈచట్టములో అన్యదా ఏర్పాటు చేయబడిననేతప్ప,

i) (ఎ) 4వ సెక్షను, 1వ సబ్ సెక్షను, 1వ క్లాజులో నిర్దేశింపబడిన పదవిరీత్యా నియమింపబడిన సభ్యుడు, ఆయన ఆయా సందర్భములనుబట్టి పంచాయతీయొక్క అధ్యక్షుడుగా గాని లేక సర్పంచిగా గాని, లేక పట్టణ సమితి అధ్యక్షుడుగా గాని యుండునంతవరకు, అట్టి సభ్యుడుగా ఉండవలెను.

(బి) 4వ సెక్షను, 1వ సబ్ సెక్షను, 1వ క్లాజుకు షరతుయొక్క క్లాజు 'బి' క్రింద నామ నిశ్చయంచేయబడిన సభ్యుడు, ఆయనను నామ నిశ్చయము చేయబడిన తేదీనుండి 3 సంవత్సరములపాటు సభ్యుడుగా ఉండవలెను; లేక పంచాయతీగాని, పట్టణ సమితిగాని తిరిగి నిర్మాణము చేయబడిన మీదట ఆయాసందర్భమును బట్టి తిరిగి నిర్మాణము చేయబడిన అధ్యక్షుడు, లేక సర్పంచి,

లేక తిరిగి నిర్మాణము చేయబడిన పట్టణసమితి అధ్యక్షుడు ఎన్నుకొనబడువరకు, సభ్యుడుగా ఉండవలెను. ఈ రెండు సందర్భములలో ఏదిముందుగా జరిగిన అప్పటివరకు ఆయన అట్టి సభ్యుడుగా ఉండవలెను.

ii) 4వ సెక్షను, 1వ సబ్‌సెక్షను, 2వ క్లాజు క్రింద నామనిశ్చయము చేయబడిన సభ్యుడు, నామనిశ్చయము చేయబడిన తేదీనుండి 3 సంవత్సరముల కాలమువరకు, లేక అతడు ఏ ప్రాంతమునకు నామ నిశ్చయము చేయబడెనో, ఆప్రాంతము పంచాయతీలోగాని, మ్యునిసిపాలిటీలోగాని చేర్చబడిన తేదీ వరకు, లేక ఆప్రాంతము పంచాయతీగా గాని, లేక పట్టణ మునిసిపాలిటీగా గాని ఏర్పాటు చేయబడినయెడల, అట్టిపంచాయతీ అధ్యక్షుడుగాని సర్పంచిగాని, లేక పట్టణ మునిసిపాలిటీ పట్టణసమితి అధ్యక్షుడుగాని ఎన్నుకొనబడువరకు లేక, వీరిలో ఏదిముందు జరిగిన అప్పటివరకుగాని, ఆయన సదరు సభ్యుడుగా ఉండవలెను.

iii) (ఎ) 4వ సెక్షను, 1వ సబ్‌సెక్షను, 3వ క్లాజుయొక్క (ఎ) (బి) (సి) (డి) సబ్‌క్లాజులక్రింద ఎన్నుకొనబడిన సభ్యుడు, ఆయన ఎన్నుకొనబడిన తేదీనుండి 3 సంవత్సరముల వరకు సభ్యుడుగా ఉండవలెను.

(బి) 4వ సెక్షను, 1 వ సబ్‌సెక్షను, 3 వ క్లాజుయొక్క సబ్‌క్లాజు (ఇ) క్రింద ఎన్నిక అయిన సభ్యుడు, ఆ బ్లాకులో పనిచేయుచున్న సహకార సంఘసభ్యుడుగా పైనుదహరించిన కాలము లోపల అట్టి సభ్యత్వమును విరమించి ననేతప్ప, 3 సంవత్సరముల కాలముపాటు సభ్యుడుగా ఉండవలెను.

8 (2) ఎన్నుకొనబడినట్టి గాని, నామనిశ్చయము చేయబడినట్టి గాని సభ్యులయొక్క పదవులలో ఆయన పదవీ కాలపరిమితి పూర్తియగుటవలన ఎట్టి ఖాళీవచ్చినప్పటికి, 4వ సెక్షన్‌లో నిర్ణయింపబడిన విధముగా ఇంకొక వ్యక్తి వలన,

నామనిశ్చయము వలనగాని, ఎన్నికవలనగాని, ఆయా సందర్భమునుబట్టి భర్తీచేయవలెను.

సభ్యుడగుటకు అనర్హతలు

9. పంచాయతీ సమితిని ఏర్పాటు చేయవలసిన తేదీన ఏ వ్యక్తి అయినను ఈ క్రింద ఉదహరించబడిన అనర్హతలలో ఏది వర్తించినను, ఆ వ్యక్తి ఈ చట్టముయొక్క నిబంధనలకు లోబడి పంచాయతీ సమితిలో సభ్యుడగుటకు అనర్హుడగును.

(ఎ) నైతిక అపరాధముతోకూడిన నేరమునకుగాక, ఇతర ఏ నేరమునకు గాని క్రిమినల్ కోర్టుచే ఆవ్యక్తి 6నెలలకు మించి ఖైదుశిక్ష విధింపబడి, ఆ శిక్ష రద్దుచేయబడక, లేక ఆ నేరము క్షమించబడక, లేక శిక్షాకాలము పూర్తియైన తదుపరి 5 సంవత్సరములు నిండకుండుటవలన; కాని ప్రభుత్వము అట్టి శిక్ష అనర్హతగా వర్తింపరాదు అని ఆదేశించవచ్చును.

(బి) ఆ వ్యక్తి మనస్థిమితము లేకగాని, చెవిటివాడు, మూగవాడుగా నుండుటవలనగాని, లేక కుష్ఠురోగియై యుండుటవలన;

(సి) ఆవ్యక్తి తనను దివాలాదారుడుగా ప్రకటించవలసినదిగా దరఖాస్తు పెట్టుకొనినగాని, లేక అవిమోచన దివాలాదారుడు అయియుండుటవలన;

(డి) ఏదైనా కంపెనీలలో డైరెక్టరుగాకాని, వాటాదారుగాతప్ప లేదా నిర్ణయింపబడిన ఇతరవిధముగాతప్ప, పంచాయతీ సమితిలో చేసికొనబడి అమలునందున్న ఖరారుతో లేక పంచాయతీ సమితికొరకు చేయబడుచున్న పనిలో సంబంధము కలిగియుండుట;

(ఇ) పంచాయత సమితి తరపున న్యాయవాదిగా వేతనముమీద నియమింపబడుటవలన, లేదా దానికి వ్యతిరేకముగా న్యాయవాదిగా వ్యవహరించుట వలన;

(యఫ్) 1898 క్రిమినల్ ప్రొసీజరుకోడు (కేంద్ర చట్టము 1898లో 5వ) క్రింద బ్లాకుయొక్క ఏ భాగముపైనను విచారణాధికారముగల గౌరవ మేజిస్ట్రేటుగా నుండుటవలన;

(జి) సదరు తేదీని పంచాయతీ సమితి సభ్యుడుగానున్న వ్యక్తికి సేవకుడుగాగాని, యజమానిగాగాని, అధికార పూర్వకముగా క్రింది ఉద్యోగస్థుడుగా గాని. ఉన్నతాధికారిగాగాని ఉండుటవలన;

## సభ్యుడుగా ఉండుటకు అనర్హతలు

**10.** 1. 11వ సెక్షనులోని నిబంధనలకు లోబడి, పంచాయతీ సమితి యొక్క ఏ సభ్యుడుగాని ఈ క్రింద పేర్కొనబడిన అనర్హతలకు లోనైనయెడల సభ్యుడుగానుండుటకు అనర్హుడగును.

(ఏ) 9వ సెక్షనులో తెలిపిన అనర్హతలకు లోనైయుండినగాని, లేక లోనైన యెడలగాని;

(బి) బ్లాకులో వరుసగా 6 నెలలకు పైబడి నివసించకపోయినయెడల;

(సి) పంచాయతీ సమితియొక్క లిఖితపూర్వకమైన సమ్మతిలేకుండ పంచాయితీ సమితి సమావేశములకు వరుసగా మూడుసార్లు హాజరు కానియెడల;

2 9వ సెక్షనులో క్లాజు 'ఎ' క్రింద ఒక వ్యక్తి సభ్యుడుగా నుండుటకు విరమించినయెడల, అప్పీలు లేక పునర్విచారణలో శిక్ష రద్దుచేయబడిన, లేక నేరము కొట్టివేయబడిన యెడల, లేక శిక్షమూలముగా ఏర్పడిన అనర్హతను ప్రభుత్వమువారు ఉత్తర్వుద్వారా తొలగించిన యెడల, అతడు సభ్యునిగా తీసుకొనబడవలెను. అట్లుతిరిగి సభ్యుడుగా తీసికొనబడిన తేదీ నాటికి, అతని సభ్యత్వకాలములో మిగిలియున్న కాలపరిమితి వరకు సభ్యుడుగా ఉండవలెను. అతని స్థానమున ఈ మధ్యకాలమున ఆఖాళీలో సభ్యుడుగానున్న వ్యక్తి, అసలు సభ్యుడు తిరిగి తీసికొనబడిన తరువాత ఆస్థాన మును ఖాళీచేయవలెను.

## సభ్యులయొక్క అనర్హతల సమస్యలను జిల్లా మునసబు నిర్ణయించుట

**11.** 1 ఎప్పుడైనను ఒక పంచాయతీ సమితియొక్క సభ్యుడు 10వ సెక్షనుక్రింధ అనర్హతలకు లోనైనట్లు ఆరోపించబడినప్పుడు, అట్టి ఆరోపణను

సభ్యుడు వప్పుకొననప్పుడును, లేక ఎప్పుడైనను ఏ సభ్యుడైనను అట్టి సెక్షను క్రింద తాను అనర్హుడైనది, లేనిదియును తనకే సందేహముకలిగినపుడు, అట్టి సభ్యుడుగాని, లేక ఏ ఇతర సభ్యుడుగాని, లేక పంచాయతీ సమితియొక్క కోరిక ప్రకారము తప్పక అధ్యక్షుడు అట్టి పంచాయతీ సమితి కార్యాలయము ఏ ప్రాంతమునందున్నదో, ఆ ప్రాంతముపై విచారణాధికారముగల జిల్లా మునసబు తీర్పుకొరకు దరఖాస్తు పెట్టుకొనవలెను. (సభ్యులు వారికి ఇష్టమున్న పెట్టుకొనవచ్చును.)

2 జిల్లా మునసబు తాను అవసరమని భావించునట్టి విచారణనుజరపి, అట్టి సభ్యుడు 10వ సెక్షను క్రింద అనర్హుడైనది, లేనిది నిర్ణయించవలెను. ఆయన నిర్ణయమే తుదినిర్ణయము.

3 అట్టి తీర్పు ఇచ్చువరకు ఆ సభ్యుడు తాను అనర్హుడు కానట్లుగానే వ్యవహరించుటకు హక్కు కలిగియుండును.

వివరణ:- ఈ సెక్షనులో జిల్లా మునసబు అనగా తెలంగాణా ప్రాంతములో 1954 హైదరాబాదు సివిలుకోర్టు చట్టము (1954 యొక్క 36వ హైదరాబాదు చట్టము) 6వ సెక్షనుక్రింద నియమింపబడిన మునసబు అని తెలియవలెను

## కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను పూర్తిచేయుట

**12.** ఏదైన నామనిశ్చయ, లేక ఎన్నికైన సభ్యుల పదవులలో వాని పదవీ కాలము ముగియులోపల ఖాళీ ఏర్పడిన యెడల, సదరు ఖాళీని ఆయా సందర్భమునుబట్టి 4వ సెక్షనులో చెప్పబడిన పద్ధతి ప్రకారము ఇంకొక వ్యక్తిచేత నామనిశ్చయమువలనగాని, ఎన్నికవలనగాని పూర్తిచేయవలెను. అట్టి నామనిశ్చయము చేయబడిన, లేక ఎన్నికయిన వ్యక్తి అతని పూర్వము సభ్యుని సభ్యత్వకాలములో శేషించిన కాలపరిమితివరకు సభ్యుడుగా ఉండవలెను.

## అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, లేక సభ్యుని రాజీనామాలు

**13.** పంచాయతీ సమితికి వ్రాత పూర్వకముగా నోటీసు ఇచ్చుట ద్వారా అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, లేక ఏ సభ్యుడు అయినను అట్టి తన అధ్యక్షపదవికి,

ఉపాధ్యక్ష పదవికి, సభ్యత్వమునకు రాజీనామా - ఇవ్వవచ్చును. ఏవ్యక్తిఅయి నను రాజీనామా చేయుచున్నపుడు బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరునకు వ్యక్తి గతముగా రాజీనామా నోటీసు అందజేసినపుడు తప్ప బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు అట్టిరాజీనామా నోటీసు అందిన తరువాత దాని యదార్ధమును ఖాయపర చుటకు ఆ సంబంధించిన వ్యక్తినుండి స్థిరపరచు కొనవలెను. వ్యక్తిగతముగా అందజేసిన రాజీనామాగాని, పైనుదహరించినట్లు ధృవపరుపబడిన రాజీనామా గాని, అట్టినోటీసు అందిన తేదీనుండి అమలులోనికి వచ్చును.

## పంచాయితీ సమితుల స్థాయీసమితులు

**14.** 1 ప్రతి పంచాయితీ సమితికీ ఈదిగువ నుదహరింపబడిన ఒక్కొక్క విషయమునకు ఒక్కొక్క స్థాయీ సమితి ఉండవలెను.

(i) వ్యవసాయము, పశుపోషణ, చిన్న నీటి పారుదల కార్య క్రమములు, విద్యుచ్ఛక్తి, భూసార రక్షణతోకూడిన భూ పునరుద్ధా రణము, హద్దుగట్లు వోయుట, మరియు మత్స్య పోషణ.

(ii) సహకారము, మితవ్యయము, చిన్న మొత్తముల పొదుపు, కుటీర పరిశ్రమ గ్రామీణ గృహనిర్మాణము, గణాంక వివరములు, మద్యపాన నిషేధము, మత్తుపదార్ధముల వాడుక, ఆరోగ్యమునకు భంగకరముగా నుండు మందు పదార్ధములు.

(iii) సాంఘిక విద్యతోకూడిన సహ విద్య, వైద్య సహాయము, మురుగు కాలువలతో సహా ఆరోగ్య పారిశుద్ధ్యములు, సాంఘిక సంక్షే మము, స్త్రీల, శిశు సంక్షేమము, మహా విపత్కాలములలో ఆపన్నుల కష్ట నివారణ;

(iv) రాకపోకల సౌకర్యములు, నిర్మాణములు, మరియు

(v) పన్నులు, ఆర్థిక విషయములు.

(2) 1వ సబ్ సెక్షనులో చెప్పబడిన 5 స్థాయీ సమితులకు పైన, ప్రభుత్వమువారి ఆమోదముతో పంచాయతీ సమితి ఒకటిగాని, అంతకు మించిగాని

స్థాయీసమితులను, పైనఉదహరింపబడని ఏ యితర విషయములకు సంబంధించిన వానికైనను ఏర్పాటుచేసికొన వచ్చును.

3 ప్రతి స్థాయీ సమితి 7 గురు సభ్యులను కలిగియుండవలెను. అందులో పంచాయతీ సమితి అధ్యక్షుడు పదవిరీత్యా సభ్యుడుగాను, చైర్మనుగాను ఉండవలెను. మిగతావారిని పంచాయితీ సమితి సభ్యులు తమలో తామే నిర్ణయించబడిన పద్ధతి ప్రకారమే ఎన్నుకొన బడవలెను.

అయితే పంచాయతీ సమితి నిశ్చయించుకొనినచో అది నిర్ణయించబడిన పద్ధతిలో శేషించిన ఆరుగురు సభ్యులకుగాను ఇద్దరిని మించకుండ పంచాయతీ సమితిలో సభ్యులు కానట్టియు స్థాయీసమితి చేయవలసిన విషయములందు అనుభవము, పరిజ్ఞానము కలిగినట్టియు వ్యక్తులను సహసభ్యులుగా వేసికొనవచ్చును.

అయితే 1వ సబ్ సెక్షను, 2వ క్లాజులో చెప్పబడిన విషయములకుగాను ఏర్పడిన స్థాయీసంఘములో పంచాయతీసమితి శేషించిన 6 గురు సభ్యులకుగాను, పంచాయితీసమితిలో సభ్యులుకానట్టియు సహకారము, కుటీరపరిశ్రమలలో అనుభవము, పరిజ్ఞానముకలిగియున్న ఇద్దరు వ్యక్తులను ఎన్నుకొనవలెను.

అయితే 1వ సబ్ సెక్షను, 3వ క్లాజులో చెప్పబడిన స్థాయీసంఘవిషయములలో కనీసము ఒక స్త్రీయును, మరియు షెడ్యూల్డుకులములనుండి ఒక ప్రతినిధియును, వారి సభ్యులలో ఉండవలెను.

4 పైనచెప్పబడిన సబ్ సెక్షనుకు భిన్నముగాకుండ ప్రభుత్వము, వారికి అవసరమని తోచినయడల ప్రకటనద్వారా, ప్రకటనలో నిర్ణయించబడునట్టి పద్ధతిప్రకారము, స్త్రీ, శిశు, సంక్షేమముకొరకు ఒక స్థాయీసంఘమును నిర్మించవచ్చును. అట్టిదానిలో అధికారరీత్యా పంచాయతీసమితి అధ్యక్షుడు, సభ్యుడుగాను, చైర్మనుగాను, ఉండి మిగతా ఇతరసభ్యులు పంచాయతీసమితిలోని సభ్యులలోనుండిగాని, అట్లు సభ్యులుగాని ఇతరవ్యక్తులనుండిగాని (ప్రకటనలో నిర్ణయింపబడిన విధముగా) స్త్రీలే ఎక్కువగా కలిగియుండునట్లు ఏర్పాటు చేయవలెను.

5 ప్రతిస్థాయీసమితియు తనకు నిర్దేశించబడినవిషయములను పురస్కరించుకొని పంచాయతీ సమితియొక్క ఏయే అధికారములను, కర్తవ్యములను

ప్రభుత్వమువారు ఉత్తర్వుద్వారా తెలుపుదురో ఆయా అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

6 అధ్యక్షుడుమినహా పంచాయతీ సమితియొక్క యేసభ్యుడుకూడ ఒకే కాలములో ఒకటికన్న ఎక్కువ స్థాయీసంఘములలో సభ్యుడుగా ఉండకూడదు.

అయితే ఎక్కడయితే పంచాయతీసమితియొక్క సభ్యులసంఖ్య పైన చెప్పబడిన విధముగా ప్రతి స్థాయీసంఘముయొక్క అన్నిస్థానములు భర్తీ చేయుటకు చాలదో, అట్టిసందర్భమున పంచాయతీసమితియొక్క ఒకసభ్యుడు ఏదైనారెండు స్థాయీసంఘములకు సభ్యుడుగా కావచ్చును.

## పంచాయితీసమితి లేక స్థాయీసమితి వ్యవహారములలో కలెక్టరు పాల్గొనుటకు గలహక్కులు

**15.** కలెక్టరు తన అధికారప్రాంతములలో వ్యవహరించుచున్న పంచాయతీ సమితి, లేక స్థాయీసమితి సమావేశములో మాట్లాడుటకుగాని, మరియు ఇతర త్రా వ్యవహారములో పాల్గొనుటకుగాని హక్కు గలిగియుండవలెను. కాని ఈ సెక్షనును అనుసరించి అట్టి సమయములలో ఓటుచేయు అధికారములేదు.

## తన స్థాయీసమితులనుండి రికార్డులను తెప్పించుకొనుటకు పంచాయతీసమితికిగల అధికారము

**16.** ఒక స్థాయీసమితియొక్క ఆధీనములోఉన్న ఏపత్రమునైనను ఆ సమితి సమావేశపు వ్యవహారముల ఉద్ధృతాంశముతోసహా పంపవలసినదిగా ఆ స్థాయీ సమితిని పంచాయతీసమితి కోరవచ్చును. అట్టి స్థాయీసమితి అట్టి ప్రతి అభ్యర్థనను పాటించవలెను.

## పంచాయితీసమితి, స్థాయీసమితుల సమావేశపు వ్యవహార నిర్వహణకొరకు చేసిన నిబంధనలు

**17.** ప్రతి పంచాయితీసమితి, లేక దాని స్థాయీసమితియును తన సమావేశ మందలి వ్యవహార నిర్వహణవిషయములో తదుపరి నిర్ణయించబడగలట్టి నిబంధనలను అనుసరించవలెను,

## పంచాయితీ సమితియొక్క అధికారములు, చేయుపనులు

**18.** (1) ఈ చట్టముయొక్క నిబంధనలకులోబడి బ్లాకు పరిపాలనాధికారము పంచాయితీ సమితికి ఉండవలెను. ప్రతి పంచాయితీ సమితియున్నూ తన అధి కార ప్రాంతమునందున్న ప్రజలలో స్వయం సహాయక శక్తిని, గౌరవను, జీవన ప్రమాణా అభివృద్ధియందు వారి ఉత్సాహమును, పురికొల్పుటకు కృషి చేయలెను. పంచాయితీ సమితి, ఈ చట్టముపలనగాని, ఈచట్టమననుసరించి గాని, దానికీయబడిన అధికారముల నన్నింటిని వినియోగించవలెను, అప్ప గించబడిన కర్తవ్యములనన్నింటిని నెరవేర్చవలెను; మరియు ఈచట్టము యొక్క కార్యములను కొనసాగించుటకొరకు ప్రభుత్వము వారిచే ఈయబడిన లేక అప్పగించబడిన అధికారములను వినియోగించవలెను. కాని పంచాయితీ సమితి ఈచట్టముచేగాని, దీనిననుసరించిగాని లేక ఏ ఇతరశాసనముక్రింద గాని దానియొక్క అధ్యక్షునకు లేక బ్లాకు డెవలప్మెంటు ఆఫీసరునకుగాని, లేక జిల్లా పరిషత్తునకు, లేక ఏదైనను ఇతర అధికారవర్గమునకు ప్రత్యేకముగా అప్పగించబడిన అధికారములను వినియోగించుటగాని, కర్తవ్యములనునెరవేర్చుట గానికూడదు. ఈచట్టములో విధించబడిన కార్యములను నిర్వర్తించుటకు ప్రభుత్వముయొక్క పూర్వామోదముతోను, నిర్ణయింపబడిన షరతులకు, నిబంధనలకులోబడి అప్పులు చేయవచ్చును. అది ఈచట్ట రీత్యాతనకు బదిలీ చేయబడునట్టి జిల్లాబోర్డు అధికారములను, అనగా పన్నులువేయుట, రుసుమును విధించుటలతో కూడిన అధికారములను, కర్తవ్యములను నెరవేర్చవలెను.

(2) ముఖ్యముగా పంచాయితీసమితి షెడ్యూలులో ఉదహరించిన కర్త వ్యములను నెరవేర్చవలెను.

(3) రద్దు చేయబడిన లేక విఘటనచేయబడిన పంచాయితీల విషయ ములలో, 4వ సెక్షను, 1వ సబ్ సెక్షను, 2వ క్లాజులో తెలుపబడిన ప్రతి ప్రాంత ములోగాని లేక అందలి ఏదైన భాగములోగాని అట్టి ప్రాంతములేక భాగము పంచాయితీగా, లేక పట్టణ మ్యునిసిపాలిటీగా ఏర్పాటు చేయబడునంతవరకు, లేక పంచాయితీలోగాని, మ్యునిసిపాలిటీలోగాని చేర్చబడునంతవరకు, పం చాయితీసమితి పన్నును లేక రుసుమును విధించు అధికారముతోసహా పంచా

యితీలకుసంబంధించి రాష్ట్రములో ప్రస్తుతము అమలులోగల, దీనికి సంబంధించిన శాసనముక్రింద తాను అవసరమని లేక ఆవశ్యకమని భావించు అధికారములను వినియోగించవచ్చును. కర్తవ్యములను నెరవేర్చవచ్చును.

(బి) రద్దుచేయబడిన లేక విఘటనచేయబడిన పట్టణసమితుల విషయములలో పంచాయితీ సమితి 1956 హైదరాబాదు జిల్లా మ్యునిసిపాలిటీలచట్టము (1956 యొక్క 18వ హైదరాబాదు చట్టము) క్రింద ఈయబడిన పన్నులు లేక రుసుములు విధించు అధికారముతోసహా తిరిగి పట్టణసమితిని ఏర్పాటు చేయబడునంతవరకు పంచాయితీసమితి పట్టణసమితియొక్క అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(4) పంచాయితీలకు, పట్టణ సమితులకు సంబంధించి రాష్ట్రములో అప్పుడు అమలులోఉన్న శాసనములో ఏమిఉన్నప్పటికిని, పంచాయితీసమితి జిల్లాపరిషత్తుయొక్క పూర్వామోదముతో ఆ బ్లాకులోని పంచాయితీల, పట్టణ సమితుల నిధులలోనుండి చందా వసూలు చేసికొనవచ్చును.

(5) ప్రతి పంచాయితీ సమితియును ప్రభుత్వమువారి పూర్వఅనుమతితో సర్‌ఛార్జిరూపములో ఒక పన్నును పంచాయితీగాని, పట్టణసమితిగాని, విధించిన పన్నుమీదగాని, లేక తన అధికార ప్రాంతములలో విధించిన భూశిస్తుమీదగాని, స్థానికపన్నులమీదగాని ఒక నిర్దేశించబడు గరిష్ట ప్రమాణమునకులోబడి అట్టి విధముగా పన్ను వేయవచ్చును,

## జాయంటుగాఉండే నీటివసతులు, మరియు ఇతర సంస్థలయొక్క నిర్వహణ కార్యములు.

**19** (1) పంచాయితీలకు, పట్టణ సమితులకు సంబంధించి, రాష్ట్రములో, అప్పుడు అమలులోఉన్న శాసనములో ఏమి ఉన్నప్పటికిని, ఈచట్ట నియమ నిబంధనలకులోబడి, రెండుగాని లేక అంతకుమించిన పంచాయతీలుగాని కలసి;

(i) ఒకే ఆధారమునుండి కడుగుటకు, స్నానమునకు, శుభ్రపరుపబడిన త్రాగెడి నీటికొరకు, నీటి సరఫరాకు, వసతులుకలసి కట్టుకొనవచ్చును. నిర్వహించవచ్చును. మరియు,

(ii) ఇంకొక పంచాయతీ సమితికి దాని ఒప్పుదలతోను మరియు ఒప్పుదల కాబడు అట్టిషరతులమీదను, ఏసంస్థ నిర్వహణగాని, ఏపనుల నిర్వహణగాని అప్పగించవచ్చును.

(2) ఈచట్ట నియమ నిబంధనలకులోబడి, రెండుగాని, అంతకుపైనుండు పంచాయితీ సమితులు నిర్దిష్టింపబడు శిశుసంక్షేమ కేంద్రములు, ఆస్పత్రులు, అట్టి తదితర సంస్థలను జాయింటుగా నెలకొల్పుకొని నిర్వహింపవచ్చును,

### బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు వద్దనుండి రికార్డులను తెప్పించుకొనుటకు పంచాయితీ సమితులు, లేక దాని స్థాయీ సమితులకు అధికారములు.

**20.** బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరును అతని ఆధీనములో ఉన్న ఏపత్రమునైనను, పంపవలసినదిగా, పంచాయితీ సమితిగాని, లేక స్థాయీ సమితిగాని ఎప్పుడైనను కోరవచ్చును. బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు ఆ అభ్యర్ధనను వెంటనే పాటించవలెను. కాని అట్టి పాటించుట పంచాయితీ సమితియొక్కగాని, ప్రజలయొక్కగాని శ్రేయస్సునకు భంగకరము కాగలదని అభిప్రాయపడినయడల అట్టి విషయమును అధ్యక్షుని నిర్ణయమునకు ఆఫీసరు తెలుపవలెను. దానిమీద అధ్యక్షుని నిర్ణయమే తుది నిర్ణయము కావలెను.

### పంచాయితీ సమితులకు గ్రామాధికారులనుండి సమాచారము తెప్పించుటకుగల అధికారము.

**21.** పంచాయితీ సమితి ఈ చట్టముకొరకు అట్టి పంచాయితీ అధికారప్రాంతముతో ఉండెడి ఏ గ్రామముయొక్క గ్రామధికారినైనను, ఆగ్రామమునకు సంబంధించినట్టిగాని, వ్యక్తినిగురించిగాని, ఆస్థిని గురించిగాని, నిర్దిష్టింపబడిన తరగతులలోవచ్చు సమాచారమును పంపవలసినదిగా ఎప్పుడైనను కోరవచ్చును.

### అధ్యక్షుని, ఉపాధ్యక్షుని అధికారములు, కర్తవ్యములు.

**22.** (1) ఈ క్రింద పేర్కొనబడిన అధికారములు కర్తవ్యములు పంచాయితీ సమితి అధ్యక్షునిచే నిర్వహించ బడవలెను,

(ఎ) పంచాయతీ సమితి గాని అందుకు సంబంధించిన స్థాయీసమితి గాని, తీర్మానములను అమలు జరుపుటకు బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరుమీద పరిపాల నాధిపత్యమును;

(బి) పంచాయతీ సమితియొక్క సమావేశములను పిలుచుట, అధ్యక్షత వహించుట, నిర్వహించుటయును;

(సి) పంచాయతీ సమితియొక్క మొత్తము రికార్డుల నందుబాటులో నుంచుకొనుటయును;

(2) అత్యవసర సమయములో అధ్యక్షుడు బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు సంప్రదింపుతో పంచాయతీ సమితి లేక స్థాయీసమితుల యొక్క అనుమతి పొందవలసిన ఏ కార్యమునైనను వెంటనే అమలు జరుపుటకు ఆదేశింపవచ్చును. అట్టి అత్యవసరముగా అమలు జరుపవలసిన పనులు, అట్లుచేయుట అతని అభిప్రాయములో ప్రజాసేవ, క్షేమముల కొరకు అవసరమని తోచినవై యుండవలెను, కాని ఈ సబ్ సెక్షను ప్రకారము అట్టిచర్యతీసికొనినప్పుడు, అట్టిచర్యకు కారణములతోసహా పంచాయతీ సమితికీగాని, సంబంధించిన స్థాయీసమితికిగాని, దానియొక్క తరువాత సమావేశములో నివేదించవలెను.

అయితే ప్రభుత్వ ఆజ్ఞకు విరుద్ధమైన ఏపనిని చేయుటకుగాని, అమలు జరుపుటకుగాని, అతడు ఆదేశించ గూడదు.

(3) ఉపాధ్యక్షుడు, ఎప్పటికప్పటికి వ్రాతపూర్వకముగా అధ్యక్షునిచే ఒప్పగించబడు అధికారములను, కర్తవ్యములను నిర్వహించవలెను.

(4) అధ్యక్షుని పదవి ఖాళీఏర్పడినప్పుడు, పంచాయతి సమితియొక్క ఉపాధ్యక్షుడు తిరిగి క్రొత్త అధ్యక్షుడు ఎన్నుకొనబడేవరకు, అధ్యక్షుని అధికారములు, కర్తవ్యములు నిర్వహించవలెను.

(5) అధ్యక్షుడు 15 దినములకంటే ఎక్కువకాలము వరుసగా బ్లాకులో లేనప్పుడు, లేక 15 దినములకంటే ఎక్కువకాలము అశక్తుడైనప్పుడు, అట్లు

ఆయన లేనట్టి, అశక్తుడైనట్టి కాలమందు ఆయనయొక్క అధికారములు, కర్తవ్యములు ఉపాధ్యక్షునకు సంక్రమించ వలెను.

(6) అధ్యక్షుని పదవి ఖాళీగా ఉండి లేక అధ్యక్షుడు 15 దినములకంటె ఎక్కువకాలము ఆయన అశక్తుడై యుండి. ఉపాధ్యక్షుని పదవికూడా ఖాళీగా యున్నప్పుడు లేక ఉపాధ్యక్షుడు 15 దినములకంటే ఎక్కువకాలము వరసగా బ్లాకులో లేనప్పుడు లేక అశక్తుడు ఐనప్పుడు, అధ్యక్షుని యొక్క అధికారములు, కర్తవ్యములు, పంచాయతీ సమితి సభ్యులచే నిర్ణయించబడిన విధముగా ఎన్నుకొనబడు సభ్యునకు సంక్రమించవలెను. అట్లు ఎన్నుకొనబడిన పంచాయతి సమితి సభ్యుడు "తాత్కాలిక అధ్యక్షుడు" అని వ్యవహరింప బడవలెను. సందర్భమునుబట్టి క్రొత్త అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు ఎన్నిక అయినట్లు ప్రకటింపబడి పదవిని స్వీకరించువరకు లేక అధ్యక్షుడుగాని ఉపాధ్యక్షుడుగాని బ్లాకుకు తిరిగి వచ్చువరకు లేక అశక్తతనుండి కోలుకొను వరకు నిర్ణయింపబడు నిర్బంధములకు, షరతులకు లోబడి, ఆయన అధ్యక్షునియొక్క అధికారమును కర్తవ్యములను నిర్వహించవలెను,

## ఇతర సభ్యులు పంచాయతీ సమితి పనులు మొ॥ వానినిగూర్చి ఎంచిచూపే హక్కు.

**23.** పంచాయతి సమితియొక్క ఏ సభ్యుడు అయినను, పంచాయతి సమితియొక్క పనులు ఆమలు జరుపుటలో నిర్లక్ష్యముకాని, పంచాయతి సమితి ఆస్తిలో దుర్వినియోగముగాని, ఒక ప్రత్యేక స్థలావసరములుగాని, మరియు ఉద్దేశములో సముచితములని తోచిన సలహాతోకూడిన అభివృద్ధినికాని, అధ్యక్షుని యొక్కగాని, బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు యొక్కగాని దృష్టికి తీసుకుని రాబడవచ్చును,

## బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరుయొక్క అధికారములు, కర్తవ్యములు.

**24.** (1) పంచాయతి సమితికి, బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు ప్రధాన కార్య నిర్వాహణాధికారిగా ఉండవలెను. పంచాయతి సమితియొక్కయు స్థాయి

సమితులయొక్కయు తీర్మానములను, అమలు జరుపుటకు ఆయన బాధ్యుడై యుండవలెను. ఆయన ప్రభుత్వమువారిచే తనకు అప్పగింపబడు అధికారము లను, కర్తవ్యములను నెరవేర్చవలెను. పంచాయతీలకు సంబంధించిన రాష్ట్ర ములో అప్పుడు అమలులోయున్న సంబంధించిన శాసనములో ఏమియున్నప్ప టికీని, ఆయనకు నిర్ణయింపబడిన పర్యవేక్షణాధి కారములను ఆ బ్లాకులోని పంచాయతీలపై వినియోగింప వలెను.

(2) బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు సాధారణముగా పంచాయతీ సమితి యొక్కగాని, దానిస్థాయీ సమితులు యొక్కగాని సమావేశములకు హాజరు కావలెను, మరియు దానిలో జరిగెడి చర్చలలో పాల్గొనుటకు అర్హుడై యుండ వలెను., కాని వోటింగు హక్కుగాని, తీర్మానము ప్రతిపాదించు హక్కుగాని వుండరాదు.

(3) పంచాయతీ సమితి సిబ్బందిలోని ఉద్యోగులును, ప్రభుత్వముచేగాని ప్రభుత్వ శాఖాదిపతిచేగాని పంచాయతీకి బదిలీచేయబడిన సంస్థలలోను, పథ కములలోను పనిచేయుచున్న ఉద్యోగులును, బ్లాకుయొక్క పరిపాలనా నియంత్రణ పర్యవేక్షణలక్రింద ఉండవలెను,

(4) (ఎ) బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు ప్రాథమిక ఆరోగ్య కేంద్ర ముపైయుండు వైధ్యాధికారికితప్ప, తన పరిపాలనా నియంత్రణక్రింద పని చేయునట్టియు బ్లాకు అంతటిపైన అధికారము కలిగినట్టియు ఏ అధికారి లేక ఉద్యోగికైనను దిగువ తెల్పిన శిక్షలుపైన నిర్ణయింపబడు షరతులకులోబడి విధించవచ్చును; అవి :—

(i) అభిశంసన

(ii) ఆశాఖకు సంబంధించిన జిల్లా శాఖాధికారితో సంప్రదించిన పిమ్మట, ఇంక్రిమెంట్లను ఆపుట,

(బి) క్లాజు (ఎ) లో ఉదహరించిన శిక్షలుకాక ఇతర శిక్షలు, ఆ ఉద్యోగికిగాని, అధికారికిగాని వర్తించు నియమములక్రింద ఏ

శిక్షలు విధించుటకు, ఎవరికి అధికారముకలదో ఆ శిక్షలు వారిచే విధించబడవచ్చును.

(5) (ఎ) బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు తన కార్యాలయమునందు నియమింపబడిన సిబ్బందితోపాటు, తన పరిపాలనా నియంత్రణక్రింద పని చేయుచున్న మొత్తం ఇతర సిబ్బందికూడా ఈ క్రింద తెలుపబడిన శిక్షలను విధించుటకు అర్హుడై యుండవలెను. అవి :—

(i) అభిశంసన

(ii) ఇంక్రిమెంట్లు ఆపివేయుట.

(iii) పంచాయితీ సమితికిగలిగిన డబ్బు నష్టమును, పూర్తిగా గాని కొంత భాగమునుగాని జీతమునుండి వసూలు చేయుట.

(iv) సస్పెండు చేయుట.

(బి) అట్టి సిబ్బంది విషయములో, డిస్‌మిస్ చేయుట, లేక ఉద్యోగమునుండి తొలగించు, లేక క్రింద ఉద్యోగమునకు తగ్గించు శిక్షలు, అధ్యక్షుడు నిర్ణయింపబడు నియమములకులోబడి విధించవచ్చును.

అప్పీలు :

(6) సబ్ సెక్షన్లు (4) లేక (5)లో విధించిన ఏ శిక్షమీదనైనను నిర్ణయింపబడు అధికారికి అప్పీలు చేసుకొను అధికారము ఉండవలెను.

(7) 18వ సెక్షనులో (1)వ సబ్‌సెక్షనులో ఏమియున్ననూ, మరియూ ఈ చట్టములోని అన్ని యితర నిబంధనలకు దానిక్రింద చేయబడిన నియమములకులోబడి, పంచాయతీ సమితి దానికి యధోచితమని తోచిన ప్రత్యేక ఆదేశములను చట్టముక్రింద అతనికి అప్పగించబడిన ఏకర్తవ్యములు నిర్వహించు విషయమునందును, ప్రత్యేక ఆదేశముతో నిచ్చుటకు అధికారము కలిగియుండవలెను.

బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు మరియు ఇతర అధికారులు మరియు పంచాయతీ సమితి సిబ్బందియు, పంచాయతీ సమితికి తాబేదారులు.

**25.** బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు మరియు పంచాయతీ సమితి యొక్క ఇతర అధికారులును, వారి సిబ్బందియును మరియు పంచాయతీ సిబ్బందియును, పంచాయతీ సమితిక్రింద ఉన్నసంస్థలు పాఠశాలలలో నియమింపబడిన సిబ్బందియును పంచాయతీ సమితికి తాబేదారులుగా నుండవలెను.

## అధికారులయు, తదితర ఉద్యోగస్థుల పదవులను సృష్టించుట నియామకములు.

**26.** (1) చట్టములో చెప్పబడిన నిబంధనలను ఆచరణలో పెట్టుటకు అవసరమని తోచిన అధికారులను మరియు ఇతర ఉద్యోగస్థులను ప్రతి పంచాయతీ సమితి ప్రభుత్వమువారి పూర్వ అనుమతిచే సృష్టించుకొనుటకు అధికారము కలిగియుండవలెను.

(2) ప్రభుత్వము ఈచట్టములోని నిబంధనలను ఆచరణలో పెట్టుటకు వారికి యధోచితమని తోచిన పదవులను ఎప్పుడైనను సృష్టించవచ్చును.

(3) 1, 2 వ సబ్ సెక్షనులలో సృష్టింపబడిన పదవులకు నియామకములన్నియును, అట్టిపదవులలోని బదిలీలును, నిర్ణయింపబడు విధాన ప్రకారము చేయబడవలెను.

## పంచాయతీ సమితియొక్క లేక దాని స్థాయీసమితుల యొక్క సమావేశములకు హాజరగుటకు భత్యములు.

**27.** (1) పంచాయతీ సమావేశమునకు హాజరైనందుకు పంచాయతీ సభ్యులకును, దాని అధ్యక్ష ఉపాధ్యక్షులకును, 5 వ సెక్షనులో నిర్దేశింపబడిన రాష్ట్ర శాసనసభల సభ్యులకును, మరియు పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితి సభ్యులకును, దాని చైర్మన్‌కును, అట్టి పంచాయతీ సమితియొక్క

స్థాయీ సమితి సమావేశములకు హాజరైనందుకు నిర్ణయింపబడిన బత్తెములు ఇవ్వవలెను.

(2) అధ్యక్షునకు బ్లాకులో ఆయనచేయు సంచారమునకు అట్టి బత్తెములు కూడ నిర్ణయింపబడిన ప్రకారము చెల్లింపవలెను.

## పంచాయతీ సమితి నిధి.

**28.** (1) పంచాయతీ సమితికి వసూలగు ధనమంతయు ''పంచాయతీ సమితినిధి'' అనుపేరుతో ఒక నిధిగా ఏర్పరుపబడవలెను. మరియు ఆ నిధి ఈ చట్టములో పేర్కొనబడిన కార్యములకొరకు, మరియు నిర్ణయింపబడునట్టి ఇతర కార్యములకొరకు అట్టిపద్ధతిలో వినియోగింప బడవలెను.

(2) పంచాయతీ సమితికి వసూలగు ధనమంతయు దగ్గరలోనున్న ప్రభుత్వ ట్రెజరీలోగాని, ప్రభుత్వము వారియొక్క అనుమతితో వారు అనుమతించిన ఏదైన బ్యాంకులోగాని ఉంచవలెను.

(3) పంచాయతీ సమితినిధిపేరట ఈయబడు ఆర్డరులపైన లేదా చెక్కులపైన ఆబ్లాకు డెవలప్మెంటు ఆఫీసరుచేతనే సంతకము చేయబడవలెను.

## పంచాయతీ సమితియొక్క ఆదాయ వ్యయములు

**29.** (1) పంచాయతీ సమితియొక్క ఆదాయ మార్గములు ఈక్రింద పేర్కొనబడిన విధముగా నుండవలెను.

(i) పంచాయతీ సమితికి ప్రభుత్వమువారిచేగాని, లేక ప్రభుత్వము యొక్క శాఖాధికారులచేగాని బదిలీ చేయబడిన సంస్థలకు, మరియు ప్రణాళికలకు సంబంధించిన నిధులు.

(ii) సమాజ వికాస కార్యక్రమములకు సంబంధించిన నిధులు.

(iii) కుటీర, గ్రామ పరిశ్రమలు, ఖాదీ, సిల్కు, నారపరిశ్రమ, చేతి పనులు మొదలగువాని అభివృద్ధికొరకై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ

ములనుండి వచ్చు సహాయము, మరియు అఖిలభారత సంస్థలు, వ్యవస్థలనుండివచ్చు సహాయము.

(iv) పంచాయతీ సమితికి పంచాయతులనుండిగాని, పట్టణ సమితులనుండి గాని లేక ప్రజలనుండి ఏ యితర రూపములలోనైనను వచ్చు విరాళములు, ద్రవ్యసహాయములు.

(v) జిల్లాబోర్డుయొక్క ఆదాయములోనుండి ప్రభుత్వమువారి ఉత్తరువు ద్వారా కేటాయింపబడినట్టి ఆదాయము.

(vi) నిర్ణయింప బడునట్టి భూమిశిస్తు, రాష్ట్రపుపన్నులు, లేక రుసుములలో వాటా.

(vii) పంచాయతీ సమితి ఏదైనను చట్టము ననుసరించి కాని లేక ఈ చట్టముక్రిందగాని విధించి, వసూలు చేయుపన్నులు, రుసుములు, లేక సర్ ఛార్జీ ద్వారావచ్చు ఆదాయము.

(viii) పంచాయతీ సమితి, పంచాయతులనుండి, పట్టణ సమితులవద్దనుండి వసూలు చేయుచందాలు.

(2) పంచాయతీ సమితి ఖర్చులలో, దాని అధికారుల, ఇతర ఉద్యోగుల జీతములును, బత్తెములును, 27 వ సెక్షన్ క్రింద చెల్లింపబడవలసిన బత్తెములును, ఈ చట్టముయొక్క కార్యములను నిర్వహించుటకుగాను ప్రభుత్వముచే ఆదేశింపబడిన ఏ యితరమైన ఖర్చుపద్దు, మరియు ఈకార్యముల నిమిత్తము అవసరమగు తదితర ఖర్చులను చేయవలెను.

## పంచాయతీ సమితియొక్క బడ్జెటు.

**30** (1) బ్లాకు డెవలెప్ మెంట్ ఆఫీసరు ప్రతి సంవత్సరము నిర్ణీత తేదీలోపల రానున్న సంవత్సరకాలమున సంభావ్యమైన ఆదాయ వ్యయములను చూపుబడ్జెటును ఒకదానిని తయారుచేసి పంచాయతీ సమితి ఎదుటనుంచవలెను. అట్టిబడ్జెటును పంచాయితీ సమితి దానికి యుక్తమని భావించునట్టి మార్పులతో మంజూరు చేయవలెను.

(2) అట్లు మంజూరు చేయబడిన బడ్జెటు నిర్ణయింపబడు తేదీనగాని అంతకుపూర్వముగాని జిల్లాపరిషత్తు లేనిచోట్ల జిల్లాకలెక్టరుకు, బ్లాకు డెవలప్ మెంటు ఆఫీసరుచేత సమర్పించ బడవలెను. మరియు సందర్భాను సారముగ, జిల్లా పరిషత్తుగాని, జిల్లా కలెక్టరుగాని ఈ చట్టముయొక్క నిబంధనను అమలు పరచు నిమిత్తము ఆ బడ్జెటులో తగినంత కేటాయింపు చేయబడలేదని తృప్తి చెందినచో జిల్లా పరిషత్తుగాని, లేక జిల్లా కలెక్టరుగాని అట్టికేటాయింపు చేయుటకు అవసరమగు మార్పులతో ఆ బడ్జెటును ఆమోదించు అధికారము కలిగియుండవలెను.

(3) ఒక సంవత్సరములోపల, పంచాయతి సమితి, దానియొక్క ఆదాయ విషయములోగాని, ఈ చట్టముయొక్క కార్యముల నిమిత్తము ఖర్చు పెట్టబడవలసిన మొత్తముల పంపిణీ విషయములోగాని, బడ్జెటులో పైమార్పులు చేయుట అవసరమని దానికితోచినఎడల, అనుబంధపు బడ్జెటు లేక మార్పు చేయబడిన బడ్జెటు 1, మరియు 2వ సబ్ సెక్షన్‌లో చెప్పబడిన రీతిని తయారుగాని, మంజూరుగాని, మార్పులుగాని చేయబడవచ్చును.

## పంచాయతీలు మరియు పట్టణ సమితులు, వాట్ల బడ్జెట్లను పంచాయతి సమితిలకు సమర్పించుట.

**31.** పంచాయతీల, పట్టణ సమితుల విషయములలో రాష్ట్రములో అప్పటికి అమలులోయుండి, దీనికి సంబంధించిన శాసనములలోను దానిక్రింద చేయబడిన నియములలోను ఏమియున్నప్పటికిని, ప్రతి పంచాయతీ, ప్రతి పట్టణ సమితి, ప్రతి సంవత్సరము దీనికొరకు ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడు తేదీలోపల, దానికి రానున్న సంవత్సరపు బడ్జెటు సమర్పించవలెను. పంచాయతీ సమితి, ఆబడ్జెటు అందిన తేదీనుండి ఒకమాసములోపల, శాసనము ప్రకారము బడ్జెటును మార్పుచేయుటకు అర్హతగల అధికారికి, దాని సూచనలతోసహ పంపవలెను. అట్టి అధికారి ఆ సూచనలను తగురీతిని పరిశీలించవలెను.

## అకౌంట్లు - ఆడిటు.

**32.** (1) పంచాయతీ సమితి, నిర్ణయింపబడు రీతినిలెఖలు (అకౌంట్లు) వివరణలను, ప్రభుత్వము వారికిని, జిల్లా పరిషత్తుకును, ఆజిల్లాకు జిల్లాపరిషత్తులేని ఎడల ఆ జిల్లా కలెక్టరుకును సమర్పించవలెను.

2 (ఏ) నిర్ణయింపబడు ఫారములో, ప్రతిపంచాయతి సమితియొక్క ఆదాయ వ్యయపు లెఖలు ప్రతి ఆర్థిక సంవత్సరమునకు వ్రాసియుంచవలెను.

(బి) పంచాయతీ సమితి తన ఆదాయమును శీర్షికల వారీగాను, సిబ్బంది కొరకైన ఖర్చులను, చేయుచున్న పనులను, ప్రతి పనికొరకు ఖర్చు చేయబడిన మొత్తమును, ఖర్చు చేయకుండా మిగిలిన మొత్తముయున్న ఆమొత్తమును, నియమములద్వారా ఆదేశింపబడిన ఇతర సమాచారమును తెలుపుచూ దాని సంవత్సరపు అక్కౌంటుయొక్క సారాంశమును తయారుచేసి, నిర్ణయింపబడిన ఫారములో ప్రభుత్వమునకును. జిల్లా పరిషత్తుకును, ఏ జిల్లాకైనా జిల్లా పరిషత్తు లేనిచో జిల్లాకలెక్టరుకు, వచ్చే ఆర్థిక సంవత్సరపు రెండవ మాసములోని 15వ తేదిలోగా సమర్పింపవలెను.

(3) సంవత్సవారి లెఖలు అన్నియూ 1వ సబ్ సెక్షన్ క్రింద తయారుచేసి ఉంచిన లెఖలు అన్నియూ, ప్రభుత్వమువారు దీనికొరకై నియమించువ్యక్తి లేక అధికారవర్గముచే ప్రతి ఆర్థిక సంవత్సరము అంతమైనమీదట వీలైన వెంటనే, తనిఖీ మరియు ఆడిటు చేయబడవలయును. అట్లు నియమింపబడ్డ ఆడిటర్లు, ఇండియన్ పీనల్ కొడు (1860లో 65వ కేంద్ర చట్టము) యొక్క 21వ సబ్ సెక్షను ప్రకారము "పబ్లిక్ సర్వెంటు''గా పరిగణింప బడవలెను.

(4) (i) ఆడిటర్లు, చట్టమునకు విరుద్ధముగానుండు ప్రతిపద్దును నిరాకరించి, అట్టిపద్దును చెల్లించిన, లేక చెల్లించుటకు అనుమతిచ్చిన వ్యక్తిపై సర్చార్జి చేయవచ్చును. మరియు, ఏవ్యక్తియొక్క నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన మూలముగా కలిగినలోటు, నష్టము, లాభదాయకములుకాని పెట్టుబడుల మొత్తములను లేదా లెఖలలో వ్రాయవలసియుండియూ వ్రాయక వదలిపెట్టబడిన మొత్తమును, అందుకు బాధ్యుడైన వ్యక్తికి చార్జీ చేయవచ్చును. అటువంటి ప్రతి సందర్భములలోను అట్టివ్యక్తినుండి ఎంతమొత్తము రావలసినది ధృవ పరుపవలెను.

వివరణ ;

ఎవరి నిర్లక్ష్యములేదా దుష్ప్రవర్తన అట్టిఏదైనా లోటు లేదా నష్టము సంభవించుటకు కారణమైనదో, లేక సహాయ భూతమైనదో, ఆవ్యక్తి తనవలన

నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన జరిగినప్పటికిని, మరొకవ్యక్తి వలన నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన జరిగి యుండనిచో అలోటుకాని, నష్టముగాని ఏర్పడి యుండెడిదికాదని వాదించుటకు వీలు ఉండ కూడదు.

(ii) ఆడిటర్లు అట్లు నిరాకరించిన ప్రతి నిరాకరణకు, సర్‌చార్జికిని, చార్జి విషయములోను, తమ నిర్ణయములకు కారణములను లిఖిత పూర్వకముగా తెలుపవలెను. దానియొక్క కాపీ నొకటిని అది ఏవ్యక్తికి సంబంధించి చేయబడినదో ఆవ్యక్తికి 1908వ సంవత్సరము సివిల్ ప్రొసీజర్‌కోడు (కేంద్రచట్టం 1908లో 5వ)లోసమ్మన్లు జారీచేయుటకు ఉదహరించిన ప్రకారం, జారీ చేయబడవలెను.

(iii) ఏవ్యక్తి అయినను, అట్లు నిరాకరణ వలనగాని, సర్‌చార్జి వలనగాని చార్జి చేయబడుటవలనగాని, నష్టబడిన, ఆడిటర్ల నిర్ణయము తనమీద జారీచేసిన 14 దినములలోపల;

(ఎ) అట్టిపద్దు నిరాకరణను, సర్‌చార్జిను, లేక చార్జీ విధింపును త్రోసి పుచ్చవలసినదిగా మొదట విచారణాధికారముగల ప్రధాన సివిల్ కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. కోర్టువారు అవసరమగు సాక్ష్యమును స్వీకరించినమీదట ఆపరిస్థితులలోవారు ఉచితమని తలంచు విధముగా ఖర్చుల విషయములో ఉత్తరువులను చేయుచు, అట్టి, పద్దు నిరాకరణను, సర్‌చార్జీని లేదా చార్జిని, ఖాయ పర్చవచ్చును, లేదా మార్పు చేయవచ్చును, లేదా తగ్గించ వచ్చును. లేక

(బి) అట్టి దరఖాస్తుకు బదులుగా ప్రభుత్వమువారికి అప్పీలు చేసుకొన వచ్చును. వారికి యుక్తమని తోచిన ఆర్డరును జారీచేయవలెను.

సబ్‌క్లాజు (ఎ) ప్రకారం కోర్టుకు అప్లికేషను దాఖలు చేసుకొనిన, అట్టి పిటీషనుకు ఆడిటర్లు మాత్రమే ప్రతి వాదులుగా ఉండవలెను, గవర్నమెంటు గాని, మరి ఏయితర వ్యక్తిగాని, ఆ ప్రొసెడింగులకు పార్టీగా చేర్చరాదు.

(iv) క్లాజు (iii)లో సబ్ క్లాజు (ఎ) క్రింద యివ్వబడిన తీర్పు నుంచి హైకోర్టుకు ఒకఅప్పీలు చేసుకొనుటకు వీలుఉండవలెను.

(v) ఎవరైనా ఒక వ్యక్తినుండి రావలసినదిగా ఈ చట్టము ననుసరించి ఆడిటర్లచే, దృవ పరుపబడిన ప్రతి మొత్తము ఆడిటర్ల నిర్ణయము, ఆ వ్యక్తికి జారీచేయబడిన తరువాత 14 రోజుల లోపల, ఆనిర్ణయముమీద ఆవ్యక్తి కోర్టుకు ధరఖాస్తు చేసుకొనుటగాని, లేదా ప్రభుత్వమునకు అప్పీలు చేసుకొనుటగాని చేయకపోయిన, బ్లాకుడెవలెప్మెంటు ఆఫీసరుకు ఆవ్యక్తిచే చెల్లింపబడవలెను. ఆవిధముగా చెల్లింపబడని ఎడల అట్టి మొత్తము లేక కోర్టువారుగాని ప్రభుత్వమువారుగాని, ఆవ్యక్తి నుండి రావలసినదిగా ప్రకటించునట్టి మొత్తము భూమిశిస్తు బకాయిగా పరిగణించి వసూలు చేయబడవలెను.

(vi) ఈ సెక్షనులో ఏమియున్నప్పటికిని, ప్రభుత్వమువారు, ఏవ్యక్తి నుండియైనను రావలసిన మొత్తముగా, ఆడిటర్లచే దృవపరుపబడిన మొత్తమును, పూర్తిగా గాని అందులో కొంతభాగముగాని లేకకోర్టువారుగాని ప్రభుత్వమువారుగాని, ఈచట్టముక్రింద ఆవ్యక్తి నుండి రావలసినదిగా ప్రకటించునట్టి మొత్తము, ఆకేసుకు సంబంధించిన పరిస్థితులన్నింటి దృష్ట్యా సబబు అని అభిప్రాయపడిన ఎడల రాబట్టుకొనుట వదులుకొనవలసినదిగా ఏసమయమందైనను ఆదేశించ వచ్చును.

(5) పంచాయతీ సమితి ఆడిటర్ల జీతాల, బత్తెములకొరకు, లేదా పంచాయతీ అక్కౌంట్లు ఆడిటు చేయుటలోఅగు తదితర ఖర్చునిమిత్తము ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడునట్టి మొత్తమును తనరాబడులలోనుండి ప్రభుత్వమువారికి చెల్లించవలెను.

## అధ్యక్షునిపై లేదా ఉపాధ్యక్షునిపై అవిశ్వాస తీర్మానము:

**33.** (1) ఈ దిగువ నుదహరించిన సబ్ సెక్షన్లలో ఏర్పాటు చేయబడిన కార్యవిధానము ప్రకారము, పంచాయతి సమితి అధ్యక్షునిపైగాని, ఉపాధ్యక్షునిపైగాని విశ్వాస రాహిత్యమును ప్రకటించు తీర్మానము ప్రతిపాదింపబడవలయును

(2) ప్రతిపాదింపదలచిన తీర్మానము యొక్క నోటీసును నిర్ణయింప బడిన ఫారము ప్రకారము వ్రాసి, పంచాయతీ సమితి మొత్తము సభ్యులలో కనీసము సగముమంది దానిపై సంతకముచేసి, ప్రతిపాదింప దలచిన తీర్మానము ప్రతితోబాటు, పంచాయతీ సమితిపై విచారణాధికారముగల కలెక్టరుకు, నోటీసుపై సంతకముచేసిన సభ్యులలో ఏ ఇద్దరైనను స్వయముగా అందచేయవలెను.

(3) దానిమీద కలెక్టరు, అతను నిర్ణయించే తేదీన పంచాయతీ సమితి కార్యాలయములో తీర్మానమును పరిశీలించుటకు సమావేశము నేర్పరచవలెను. అట్లు నిర్ణయింపబడు తేది 2వ సబ్ సెక్షనుక్రింద అతనికి నోటీసు అందిన తేదీ నుండి ముప్పదిదినములకు మించకుండా వుండవలెను. ఆయన అట్టి సమావేశము యొక్క నోటీసును కనీసము పదునైదుదినములు ముందుగా సభ్యులకు నిర్ణయింప బడు పద్ధతిని ఈయవలెను.

వివరణ :- ఈ సబ్ సెక్షనులో చెప్పబడిన 30 దినముల కాలమును లెక్కించునపుడు ఈ సెక్షను క్రింద చేయబడిన ప్రతిపాదనపై ఒక అర్జీ దాఖలు చేసికొనబడిన మీదట అర్హతగల న్యాయస్థానముచే జారీచేయబడిన ఏదైనా నిలుపుదల ఉత్తరువు అమలులో యున్నకాలమును అందులోనుండి మినహాయింపవలెను.

(4) అట్టి సమావేశమునకు కలెక్టరు అధ్యక్షత వహించవలెను, సమావేశమునకై నిర్ణయింపబడిన సమయము గడిచిన తరువాత అర్ధగంటలోగా ఆ సమావేశమునకు అధ్యక్షత వహించుటకు కలెక్టరు హాజరు కాని ఎడల, ఆ సమావేశము 6వ సబ్ క్లాజు క్రింద ఆయన నిర్ణయించు తేదీనాటికి వాయిదా వేయవలెను.

(5) కలెక్టరు కనుక సమావేశమునకు హజరు కాలేని పక్షమున, ఆయన దానికి కారణములు లిఖిత పూర్వకముగా రికార్డుచేసిన తరువాత, తాను నిర్ణయించు మరొక తేదీకి సమావేశమును వాయిదా వేయవలెను, అట్లు ఆయనచే నిర్ణయింపబడినతేది 3వ సబ్ క్లాజు క్రింద సమావేశమునకు నిర్ణయింపబడిన తేదీనుండి 30 దినములు మించకుండా యుండవలెను. వాయిదాపడిన సమా

వేశము నోటీసును సభ్యులకు కనీసము 10 పూర్తిరోజుల ముందుగా జారిచేయ బడవలయును.

(6) (4) (5) సబ్ సెక్షన్లలో చెప్పిన ప్రకారము తప్ప, ఈ సబ్ సెక్షను క్రింద తీర్మానమును పరిశీలించుటకు ఏర్పరుపబడిన సమావేశము, ఏకారణము చేతగాని వాయిదా వేయబడకూడదు.

(7) ఈ కలెక్టరు, ఈ సెక్షను క్రింద ఏర్పాటు చేయబడిన సమావేశము ప్రారంభమైన వెంటనే, ఏ తీర్మానమును పరిశీలించుటకు సమావేశము ఏర్పాటు చేయబడినదో ఆ తీర్మానమును పంచాయితీ సమితికి చదివి వినిపించి, దానిపై చర్చించవచ్చని ప్రకటించవలెను.

(8) ఈ సెక్షను క్రింద తీర్మానముపై జరుపబడు ఎట్టి చర్చగాని వాయిదా వేయబడకూడదు.

(9) అట్టి చర్చ, సమావేశము ప్రారంభమగుటకు నిశ్చయింపబడిన సమయమునుండి రెండుగంటలు గడిచిన పిమ్మట, అంతకుముందే పూర్తిగానిచో దాని అంతట అదే సమాప్తమైపోవలెను. చర్చ పూర్తియైనమీదట లేదా సదరు 2 గంటలు కాలపరిమితి మీరిన పిమ్మట ఈ రెండింటిలో ఏదిముందు జరిగిన అప్పుడు తీర్మానమును వోటుకు పెట్టవలెను.

(10) కలెక్టరు అట్టి తీర్మానము యొక్క గుణగణములను గురించి మాట్లాడకూడదు. దానిపై ఓటుచేయుటకు ఆయనకు హక్కు ఉండదు.

(11) కలెక్టరు, సమావేశము ముగిసిన వెంటనే ప్రభుత్వమునకు, తీర్మానము ప్రతితోబాటు సమావేశపు మినిట్ల ప్రతియున్ను, దానిపై వోటింగు ఫలితమున్ను పంపవలెను.

(12) పంచాయతీ సమితి మొత్తము సభ్యులలో కనీసము ఐదింట మూడు వంతుల మంది సభ్యులచే బలపరుపబడి తీర్మానము ఆమోదింపబడినచో, ప్రభుత్వమువారు ప్రకటనద్వారా అధ్యక్షుని లేదా సందర్భానుసారముగా ఉపాధ్యక్షుని తొలగించవలెను.

(13) పైనచెప్పబడినంత ఎక్కువ సంఖ్యతో తీర్మానము ఆమోదింపబడని యెడల లేదా కోరం లేనందున సమావేశమును జరుపుటకు వీలులేకుండా యున్న ఎడల అదే అధ్యక్షుని లేదా ఉపాధ్యక్షునిపై అవిశ్వాసమును ప్రకటించు తరువాత ఏతీర్మానపు నోటీసుగాని, సమావేశపు తేదీనుండి ఆరు నెలలు గడుచునంతవరకు ఈయబడకూడదు.

(14) అధ్యక్షుడుగాని ఉపాధ్యక్షుడుగాని పదవిని స్వీకరించిన ఆరు మాసములలోపల ఈ సెక్షనుక్రింద తీర్మానపు నోటీసు ఈయబడకూడదు.

## ప్రభుత్వమునకు, పంచాయతీ సమితి అధ్యక్షునిగాని ఉపాధ్యక్షునిగాని తొలగించుటకు అధికారము.

**34** (1) ప్రభుత్వమువారి, అభిప్రాయములో, పంచాయతి సమితియొక్క అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని పంచాయతి సమితి సరిగాపనిచేయునిమిత్తము ప్రభుత్వమువారి ఉత్తర్వులను ఉద్దేశ్య పూర్వకముగా చేయక పోయినను, లేదా చేయుటకు నిరాకరించినను లేదా వారికీయబడిన అధికారములను దుర్వినియోగము చేసినను, వారు సంజాయషీ చెప్పుకొనుటకు అవకాశము నిచ్చినమీదట, ఉత్తర్వుద్వారా అధ్యక్షుని లేదా సందర్భాను సారముగా, ఉపాధ్యక్షుని తొలగించవచ్చును.

(2) 33వ సెక్షనులో (1) వ సబ్ సెక్షనుక్రింద పంచాయతీ సమితి అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని తొలగింప బడినప్పుడు, అట్టి ఖాళీని 3వ సబ్ సెక్షనుకులోబడి, 7వ సెక్షనులో చెప్పబడినప్రకారము నిర్ణయింపబడిన తేదీలోపల భర్తీ చేయవలెను.

(3) ఈ సెక్షను క్రిందగాని, 33వ సెక్షను క్రిందగాని తొలగింపబడిన అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని, తొలగింపబడిన తేదీలగాయతు రెండు సంవత్సరముల కాలము తిరిగి ఎన్నికకు అర్హులై యుండకూడదు.

## పంచాయతీ సమితి మరియు స్థానిక అధికారుల జాయింటుసభ

**35** (1) పంచాయతి సమితి కావలెనన్న, లేదా ప్రభుత్వము ఉద్దేశించిన, తప్పకుండా, ఒకటిగాని, ఒకటికన్నా ఎక్కువ అయిన స్థానిక అధికారులతో

వారుభయులు బాధ్యులైన ఏకార్యమునకైనను జాయింటుసభగా ఏర్పడుచుకొను టకు కలవవలెను.

# 3 వ అధ్యాయము

## జిల్లా పరిషత్తుల స్థాపన, సంఘీకరణ, నిర్మాణము, అధికారములు, కర్తవ్యములు మొదలగునవి.

### జిల్లా పరిషత్తుల స్థాపన, సంఘీకరణ, నిర్మాణము.

**36** (1) ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా అందులో నిర్ణయింపబడే తేదీ నుండి ఒక జిల్లాకొరకు, జిల్లా పరిషత్తును స్థాపించవచ్చును.

(2) ప్రతి జిల్లా పరిషత్తు, అది యేజిల్లాకొరకు స్థాపించబడినదో ఆజిల్లా పేరుతో ఒక సంఘీభూత సంస్థగా ఉంటూ, ఎల్లప్పుడూ ఉత్తరాధికారమును, సమిష్టి ముద్రను, ఆస్థిని సంపాదించుకొనుటకు, పరిష్కరించు, ఖరారుచేసుకొను, అధికారములు కలిగియుండును. దానియొక్క సంస్థ పేరుతో [అది] దావా చేయవచ్చును, లేక [దానిమీద] దావా వేయబడవచ్చును.

(3) ప్రతి జిల్లా పరిషత్తు ఈ క్రింద సభ్యులను కలిగియుండవలెను. అవి ఏవనగా:

(i) ఉద్యోగ రీత్యా జిల్లాలోని ప్రతి పంచాయితీ సమితి అధ్యక్షుడు:- అయితే, ఏ పంచాయితీ సమితి అధ్యక్షుడు అయినను జిల్లా పరిషత్తు సభ్యుడుగా యుండుటకు నిరాకరించినను, అట్టిసభ్యత్వము నకు రాజీనామా యిచ్చినను, లేక అన్యదా అట్టి సభ్యుడుగా వుండుటకు (సభ్యత్వము) విరమించిననూ, అట్టి నిరాకరణ, రాజీ నామా, విరమణ తేదీనుండి పంచాయితీ సమితికి అధ్యక్షుడుగా వుండకూడదు. మరియు అతని స్థానే ఆయన తరువాత వచ్చే వ్యక్తి జిల్లా పరిషత్తుకు సభ్యుడై యుండవలెను.

(ii) జిల్లా కలెక్టరు.

(iii) ఆ జిల్లానుండి ఎన్నికైన రాష్ట్ర యెస్సెంబ్లీ సభ్యులు.

(iv) ప్రభుత్వముచేత నిర్ణయింపబడే అట్టి రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు.

(v) జిల్లాలోని నియోజకవర్గములనుండి లోక్‌సభకు ఎనికైన సభ్యులు.

అయితే, అట్టి ఒక నియోజక వర్గమునకు ప్రాతినిధ్యము వహించు లోక్‌సభ సభ్యునియొక్క నియోజకవర్గము ఒకటికన్నా ఎక్కువ జిల్లాలలో భాగమైయున్న, అతను ఎన్నుకొను అట్టి ఒకేజిల్లా పరిషత్తుకు సభ్యుడుగా వుండవలెను.

(vi) ఉత్తర్వు ద్వారా ప్రభుత్వము నిర్దేసించు రాజ్యసభ సభ్యులు.

(vii) పంచాయితీ సమితిని స్థాపింపబడని ప్రతిబ్లాకుకు, ఆ బ్లాకులో నివసించుచున్న, వారిలో నిర్ణీత ప్రకారం ఎన్నుకొనబడిన ఒక వ్యక్తి.

(ఎ) ఆంధ్రప్రాంతములో ఆ బ్లాకులో ఉన్న పంచాయితీల అధ్యక్షులు,

(బి) తెలంగాణా ప్రాంతములో ఆ బ్లాకులో ఉన్న పంచాయితీ సర్పంచులు; మరియు పట్టణ సమితుల అధ్యక్షులు.

(viii) ఈ క్రింద నుదహరించినవారు నిర్ణయింపబడిన ప్రకారము, ప్రత్యేకముగా పిలువబడి, కలెక్టరుచేత అధ్యక్షత వహించబడిన, సమావేశములో [i] నుంచి [vii] క్లాజులలో చెప్పబడిన సభ్యులచేత ఎన్నుకొనబడవలెను:-

వారు:

(ఎ) ఇద్దరు స్త్రీలు.

(బి) షెడ్యూల్డు కులములయొక్క ప్రతినిధి.

(సి) షెడ్యూలు తెగలయొక్క ప్రతినిధి. దీనికి ఆజిల్లాకలెక్టరు గత జనాభా అంకెల ఆధారముగా, అజిల్లాలోని మొత్తము జనాభాలో నిర్ణయించ బడిన శాతముకన్న తక్కువలేదని ప్రకటించినపుడు, మరియు అట్టి షెడ్యూల్డు తెగల జనాభా అట్టిశాతముకన్నా తగ్గినప్పుడు షెడ్యూల్డు కులములోని మరి యొక ప్రతినిధి.

## జిల్లాపరిషత్తు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నికలు - పదవికాలము ఖాళీలు భర్తీచేయుట.

**37** (1) ప్రతి జిల్లా పరిషత్తుకు ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు ఉండ వలెను. వారు జిల్లాపరిషత్తు సభ్యులచేత వారలలో నుండే ఎన్నుకొనబడవలెను.

కాని, జిల్లాకలెక్టరు అధ్యక్షుడుగాగాని, ఉపాధ్యక్షుడుగాగాని ఎన్నుకొన బడరాదు,

అయితే యింకా, పంచాయతి సమితి అధ్యక్షుడుకనక జిల్లాపరిషత్తు అధ్యక్షుడుగా ఎన్నిక అయినప్పుడు అయన అట్టి పంచాయతీసమితి అధ్యక్షుడుగా అట్టి ఎన్నిక అయిన తేదినుంచి విరమించుకొనవలెను, కాని అట్టి విరమణ అతను జిల్లాపరిషత్తు సభ్యుడుగా వుండుటకుగాని, పంచాయతి సమితి సభ్యుడుగా వుండుటకుగాని, ఎట్టి అభ్యంతరము వుండకూడదు,

అయితే ఏవ్యక్తికూడ ఒకటికన్న ఎక్కువ జిల్లాపరిషత్తులకుఅధ్యక్షుడుగా వుండకూడదు.

(2) 36 వ సెక్షను (2) వ సబ్ సెక్షను క్రింద జిల్లాపరిషత్తు స్థాపింప బడిన వెంటనే, నిర్ణయించిన ప్రకారము జిల్లాకలెక్టరుచేత, అధ్యక్షుని ఉపాధ్య క్షుని, ఎన్నుకొనుటకు జిల్లాపరిషత్ యొక్క సమావేశము ఏర్పాటుచేయబడ వలెను. ప్రథమముగా అధ్యక్షుడు ఎన్నుకొన బడవలెను. ఆయన ఎన్నుకొన బడిన పిదప ఉపాధ్యక్షుడు ఎన్నుకొనబడవలెను, అధ్యక్షుని ఎన్నికకు జిల్లా కలెక్టరును, ఉపాధ్యక్షుని ఎన్నికకు అధ్యక్షుడును అట్టి సమావేశములకుఅధ్యక్షత వహించవలెను.

3 (ఎ) అధ్యక్షుని పదవిలో యాదృచ్ఛిక ఖాళీ భర్తీచేయుటకు జిల్లా కలెక్టరుచేత జిల్లా పరిషత్ సమావేశము ఏర్పాటు చేయబడి నిర్ణయప్రకారము ఎన్నికలు జరుపబడవలెను. జిల్లాకలెక్టరు అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

(బి) ఉపాధ్యక్షుని పదవిలోయాదృచ్ఛిక ఖాళీ భర్తీచేయుటకు అధ్యక్షుని చేత జిల్లా పరిషత్ సమావేశము ఏర్పాటు చేయబడి, నిర్ణయ ప్రకారము ఎన్నికలు జరుపబడవలెను. అధ్యక్షుడు అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

(4) ఇంకొకరీతిగా నిబంధింపబడియుండిననే తప్ప, అధ్యక్షుని, ఉపాధ్యక్షుని పదవీ కాలము 3 సంవత్సరములు. అధ్యక్షునియొక్కగాని, ఉపాధ్యక్షునియొక్కగాని పదవులలో అట్టికాల పరిమితి అంతమగులోపల ఖాళీవచ్చిన ఆఖాళీలో అధ్యక్షుడుగా, ఉపాధ్యక్షుడుగా ఎన్నుకొనబడే వ్యక్తి అతని పూర్వము చేసినవాని శేషించిన కాలపరిమితి వరకు పదవిలోయుండవలెను.

## జిల్లా పరిషత్తు కార్యదర్శి.

**38** ప్రభుత్వమువారు జిల్లా పరిషత్తుకు ఒక కార్యదర్శిని నియమింపవలెను. ఆయన, నిర్ణయింపబడిన అధికారములను వినియోగింపవలెను. కర్తవ్యములను నిర్వర్తింపవలెను.

## జిల్లా పరిషత్తు సభ్యుల పదవీ కాలము, ఖాళీలను భర్తీచేయుట.

**39**. (1) ఈ చట్టములో మరియొక విధముగా నిబంధింపబడియుండినతప్ప:—

(i) 36వ సెక్షను (3) వ సబ్ సెక్షను (1) వ క్లాజులో చెప్పబడిన, పదవిరీత్యా (ఉండబడే) సభ్యుడు, ఆయన ప్రాతినిధ్యము వహించు పంచాయతీ సమితికి ఆయన అధ్యక్షుడుగ ఉన్నంత కాలము పదవిలో ఉండవలెను;

(ii) 36వ సెక్షను (3)వ సబ్‌సెక్షనుయొక్క (iii) (iv) (v) లేక (vi) క్లాజులో చెప్పబడిన సభ్యుడు, సందర్భానుసారముగా

ఆయన, ఆ యొక్క రాష్ట్ర అసెంబ్లీకిగాని, పార్లమెంటుకిగాని సభ్యుడుగా ఉండునంత కాలము పదవిలో ఉండవలెను;

(iii) 36వ సెక్షను, (3)వ సబ్ సెక్షను (vii)వ క్లాజులో చెప్పబడిన సభ్యుడు మూడు సంవత్సరముల పాటుగాని లేక అట్టి బ్లాకు కొరకు పంచాయతీ సమితి స్థాపింపబడు తేదీవరకుగాని, లేక దీనిలో ఏదిముందు ముగిసిన అంతవరకుగాని, పదవిలో ఉండవలెను.

(iv) 36వ సెక్షను (3)వ సబ్ సెక్షనులో (viii)వ క్లాజు క్రింద ఎన్నుకొనబడిన సభ్యుడు ఆయన ఎన్నుకొనబడిన తేదీ నుండి మూడు సంవత్సరముల కాలము పదవిలో యుండవలెను.

(2) 36వ సెక్షనుయొక్క [3] వ సబ్ సెక్షనుయొక్క [vii] లేక [viii] క్లాజుల క్రింద ఎన్నుకొనబడిన సభ్యుని పదవులలో ఖాళీ, ఆయన పదవీ కాలము ముగియుటవలన ఏర్పడి నప్పుడు, ఆ క్లాజుక్రింద ఇంకొక వ్యక్తి యొక్క ఎన్నికద్వారా భర్తీచేయబడవలెను.

అనర్హతలు.

**40.** 37వ సెక్షను [3]వ సబ్ సెక్షను iiవ క్లాజులో చెప్పబడిన సభ్యులకుతప్ప జిల్లా పరిషత్తు సభ్యులందరికినీ 9, 10, 11 సెక్షనులలోని నిబంధనలు వర్తింపవలెను. అయితే "బ్లాకు" "పంచాయితీ సమితి" "జిల్లా మునసపు" అను మాటలకు బదులు క్రమముగా "జిల్లా" "జిల్లా పరిషత్తు" "జిల్లా జడ్జి" అను మాటలు ఉంచవలెను.

కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను నింపుట.

**41.** 36వ సెక్షను [3]వ సబ్ సెక్షను [vii] కాక [viii] క్లాజులక్రింద ఎన్నుకొనబడిన సభ్యుని పదవిలో ఖాళీ, ఆయన పదవీకాలము ముగియుటకు పూర్వమే ఏర్పడిన, ఆ ఖాళీ ఆ క్లాజుక్రింద మరియొక వ్యక్తియొక్క ఎన్నిక

చేత నింపవలెను. అట్టివ్యక్తి తత్పూర్వ సభ్యుని పదవీకాలములో శేషించిన కాలమువరకు పదవిలో యుండవలెను.

## అధ్యక్షుని, లేక ఉపాధ్యక్షుని లేక సభ్యుని రాజీనామా.

**42.** 36వ సెక్షను [3]వ సబ్ సెక్షను [ii]వ క్లాజులో చెప్పబడిన సభ్యుడు తప్ప, అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని, ఏ సభ్యుడుగానిజిల్లా పరిషత్తుకు వ్రాత పూర్వకముగా నోటీసును యిచ్చుటద్వారా అట్టి అధ్యక్ష, ఉపాధ్యక్ష, సభ్యత్వ పదవులకు రాజీనామా ఇవ్వవచ్చును. ఏ వ్యక్తి అయినను రాజీనామా చేయునప్పుడు జిల్లా పరిషత్తు కార్యదర్శికి స్వయముగా రాజీనామా నోటీసు అందజేసినప్పుడు తప్ప, జిల్లా పరిషత్తు కార్యదర్శి అట్టి రాజీనామా నోటీసు అందిన తరువాత దాని యథార్థత్వమును ఖాయపరచుటకు ఆ సంబంధించిన వ్యక్తినుండి స్థిరపరచుకొనవలెను, అట్లు స్వయముగా అందజేసిన లేక ధృవపరుపబడిన రాజీనామా అట్టి నోటీసు అందిన తేదీనుండి అమలులోనికి వచ్చును.

## జిల్లా పరిషత్తుయొక్క స్థాయీసమితులు.

**43.** (1) ప్రతి జిల్లా పరిషత్తుకు ఈ క్రింద తెలిపిన ఒక్కొక్కదానికి ఒక్కొక్క స్థాయీ సమితి ఉండవలెను.

(i) ప్రణాళిక, సమాజ వికాసము, రాకపోకల సౌకర్యములు.

(ii) ఆహారము మరియు వ్యవసాయము, సహకారము, పశుపోషణ, అడవులు, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి.

(iii) పరిశ్రమలు: కుటీర, గ్రామ, లఘుపరిశ్రమలతోసహా;

(iv) విద్య, వైద్యము మరియు ఆరోగ్య పారిశుధ్యములు మరియు సాంఘిక సంక్షేమము,

(vi) పన్నులు. ఆర్థిక విషయములు,

(2) 1 వ సబ్ సెక్షనులో చెప్పబడిన 5 స్థాయీసమితులకు పైన. ప్రభుత్వమువారి ఆమోదముతో జిల్లాపరిషత్తు ఒకటిగాని, అంతకు మించిగాని స్థాయీ

సమితులను, పైన ఉదహరింపబడని ఏ యితర విషయములకు సంబంధించిన వానికైనను ఏర్పాటు చేసుకొనవచ్చును.

(3) (ఎ) ప్రతి స్థాయీసమితిలోను 9 మంది సభ్యులుఉండవలెను; కాని 1వ సబ్ సెక్షను 4 వ క్లాజులో ఉదహరించిన విషయములకు మాత్రం 10 మందిగల స్థాయీసమితి ఉండవలెను. అట్టి, సందర్భానుసారముగా ఏర్పడే 9 మందిగాని పదిమందిగాని గల సభ్యులలో జిల్లా పరిషత్తు అధ్యక్షుడు మరియు జిల్లా కలెక్టరు ఉద్యోగ రీత్యా సభ్యులై యుండవలెను. మిగతా సభ్యులు నిర్ణయింపబడిన ప్రకారం జిల్లా పరిషత్ సభ్యులలోనుండి ఎన్నుకొనబడవలెను.

అయితే అది :-

(i) సబ్ సెక్షను [1] క్లాజు [i]లో సూచించబడిన విషయములకు ఏర్పడే స్థాయి సమితి విషయములో, జిల్లా పరిషత్, నిర్ణయింపబడిన ప్రకారం, మిగిలిన ఏడుగురు సభ్యులలో ఒకరిని ఎన్నుకొనవలెను. అట్లు చేయుటలో ఆంధ్ర ప్రాంతమునుండి ఆజిల్లాలో నుండి మునిసిపల్ అధ్యక్షులలోనుండి, తెలంగాణా ప్రాంతము నుండి జిల్లా పరిషత్తు సభ్యులుగాని పట్టణ మునిసిపాలిటీల అధ్యక్షులలో నుంచి.

(ii) సబ్ సెక్షను [1] క్లాజులు [ii] మరియు [iii]లో సూచించిన విషయములకు ఏర్పడే స్థాయీ సమితుల విషయములలో, జిల్లా పరిషత్తు, నిర్ణయింపబడిన ప్రకారం జిల్లా పరిషత్తు సభ్యులుగాని, సహకారములోగాని, సందర్భమునుబట్టి కుటీర పరిశ్రమలలోగాని అనుభవము, విజ్ఞానము కలిగిన ఒకరిని, మిగిలిన ఏడుగురు సభ్యులలో ఒకరినిగా ఎన్నుకొనవలెను.

(iii) సబ్ సెక్షను [1] క్లాజు ]iv] లో సూచింపబడిన విషయములకు ఏర్పడే స్థాయి సమితి విషయములో, మిగిలిన ఎనమండుగురు సభ్యులలో ఒకరు స్త్రీ అయి యుండవలెను, మరియు ఒకరు షెడ్యూల్డు కులముల ప్రతినిధి; వీరు జిల్లా పరిషత్తుచేత నిర్ణయింపబడిన విధముగా జిల్లా పరిషత్తు సభ్యులుగాని, ఆ జిల్లాలో నివసించేవారినుండి ఎన్నుకొనబడవలెను.

(iv) మిగిలిన స్థాయీ సమితి విషయములో జిల్లా పరిషత్తు నిశ్చయించినచో మిగిలిన ఏడుగురు సభ్యులలో ఒకరిని, జిల్లా పరిషత్తు సభ్యులుగానట్టియు, స్థాయీ సమితులకు వప్పగింపబడ్డ విషయములలో అనుభవము, విజ్ఞానము కలిగినట్టి వారిలోనుండి నిర్ణయింపబడ్డ విధానముగా ఎన్నుకొనబడవలయును.

(b) జిల్లా కలెక్టరు ప్రతి స్థాయీ సమితికి అధ్యక్షుడుగా యుండవలెను. జిల్లా కలెక్టరు ఆయనలేని పక్షములో, జిల్లా పరిషత్తు అధ్యక్షుడును; వీరు ఇద్దరూ లేని పక్షములో స్థాయీ సమితి సభ్యుడుగానున్న ఉపాధ్యక్షుడు, అట్టి ఉపాధ్యక్షుడుకూడా లేని పక్షములో, ఆ స్థాయి సమితి సమావేశమునకు హాజరయిన సభ్యులలోనుండి ఏరుకొన్న సభ్యుడు అధ్యక్షత వహించవలెను.

(4) ప్రతి స్థాయీ సమితియు తనకు వప్పగింపబడిన విషయములను పురస్కరించుకొని జిల్లా పరిషత్తుయొక్క ఏయే అధికారములను, కర్తవ్యములను ప్రభుత్వమువారు ఉత్తర్వులద్వారా నిర్దిష్టము చేయుదురో, ఆయా అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నిర్వహించవలెను.

(5) జిల్లా పరిషత్తు అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు తప్ప ఇంకేవ్యక్తికూడా ఏక కాలమున రెండు స్థాయీ సమితులలో సభ్యుడుగా ఉండరాదు. అయితే, ఎక్కడయితే జిల్లా పరిషత్తుయొక్క సభ్యులసంఖ్య పైన చెప్పబడిన విధముగా ప్రతి స్థాయీ సంఘముయొక్క అన్ని స్థానములు భర్తీచేయుటకు చాలదో, అట్టి సందర్భమున జిల్లా పరిషత్తుయొక్క ఒక సభ్యుడు ఏరెండు స్థాయీ సంఘములకు సభ్యుడు కావచ్చును.

## కొందరు జిల్లా అధికారులకు జిల్లా పరిషత్తు యొక్కగాని దాని స్థాయీ సమితియొక్కగాని ప్రొసీడింగులలో పాల్గొనుటకుహక్కు.

**44.** ప్రభుత్వమువారిచే, ఉత్తరువుద్వారా ఆదేశింపబడ్డ, జిల్లా అధికారులు జిల్లా పరిషత్తు లేక దాని స్థాయీ సమితి సమావేశములో మాట్లాడుటకుగాని, మరియు ఇతరత్రా వ్యవహారములలో పాల్గొనుటకుగాని హక్కు గలిగియుండ

వలెను. కాని, ఈ సెక్షనును అనుసరించి అట్టి సమయములలో ఓటు చేయు అధికారములేదు.

## జిల్లా పరిషత్తుయొక్క లేదా దానిస్థాయీ సమితియొక్క సమావేశములో వ్యవహారము జరుపుకొనుటకు నియమములు.

**45.** ప్రతి జిల్లా పరిషత్తు లేక దాని స్థాయీ సమితి దానియొక్క సమావేశములు, నడుపుకొను వ్యవహారములో నిర్దిష్టింపబడు నియమములు పాటింపవలెను

## జిల్లా పరిషత్తుగాని, స్థాయీ సమితిగాని దాని కార్యదర్శివద్దనుండి రికార్డులను తెప్పించుకునే అధికారము.

**46.** జిల్లా పరిషత్తు లేక అట్టి జిల్లా పరిషత్తు స్థాయీ సమితి ఎప్పుడైనా కార్యదర్శి ఆధీనములోఉన్న ఏదైనా పత్రములు అందచేయవలసినదిగా ఆయనను కోరవచ్చును. కార్యదర్శి అట్టి అభ్యర్ధనను పాటించుట జిల్లా పరిషత్తుయొక్కగాని ప్రజలయొక్కగాని శ్రేయస్సుకు భంగకరమని కార్యదర్శి భావించినప్పుడు తప్ప, అట్టి ప్రతి అభ్యర్ధనను కార్యదర్శి పాటింపవలెను, కార్యదర్శి అట్లు భావించిన సందర్భములలో ఆయన ఆసంగతిని జిల్లా పరిషత్తు అధ్యక్షునకు సూచించవలెను. దానిమీద ఆయన నిర్ణయమే తుది నిర్ణయము అయి యుండవలెను.

## జిల్లా పరిషత్తుయొక్క అధికారములు, కర్తవ్యములు.

**47.** (1) ప్రతి జిల్లా పరిషత్తుకూడా ఈ క్రింది అధికారములను కలిగి యుండవలెను:—

(i) ఆజిల్లాలోని పంచాయతీ సమితుల బడ్జట్లను పరిశీలించి ఆమోదించుట.

(ii) కేంద్ర లేక రాష్ట్రప్రభుత్వమువారిచే ఆజిల్లాకుగాను కేటాయింపబడిన నిధులను ఆజిల్లాలోని పంచాయతీ సమితులకును పంచాయతీ సమితులు స్థాపింపబడని బ్లాకులకును పంచుట,

(iii) ఆ జిల్లాలోని బ్లాకుల విషయములో తయారుచేయబడిన ప్రణాళిక లను సమన్వయించి మొత్తము జిల్లాకు ప్రణాళికలను తయారు చేయుట.

(iv) జిల్లాలోని రెండుగాని అంతకు మించి ఎక్కువ బ్లాకుల సమిష్టి ప్రణాళికల, ప్రాజెక్టుల లేక పథకముల నిర్వహణను సాధిం చుట,

(v) జిల్లాలోని పంచాయతీ సమితుల కార్యకలాపములను సర్వసాధార ణముగా పర్యవేక్షించుట.

(vi) ఏ పన్నులు లేక రుసుములను విధించు అధికారముతోబాటు జిల్లా బోర్డుయొక్క ఏ అధికారములు కర్తవ్యములు ఈ చట్టముక్రింద తనకు సంక్రమింపబడునో ఆయా అధికారములను కర్తవ్యము లను వినియోగించుట, నెరవేర్చుట;

(vii) ప్రభుత్వమువారు ఒక ప్రకటనద్వారా, ఏదైనా కార్యక్రమము విషయములో తనకు ఇచ్చునట్టి ఇతర అధికారములను విని యోగించుట, అప్పగించు ఇతర కర్తవ్యములను నెరవేర్చుట.

(viii) స్థానిక సంస్థలచేతగాని ప్రభుత్వమువారిచేతగాని ఆజిల్లాలో నిర్వ హింపబడుచున్న వికాస కార్యకలాపములకును, సేవాకార్య క్రమముల నిర్వహణకును సంబంధించిన అన్నివిషయములలో ప్రభుత్వమువారికి సలహానిచ్చుట;

(ix) పంచాయతీలకు, పంచాయతీ సమితులకు పనుల కేటాయింపును గురించియు, రెండు సంస్థల మధ్యను, వివిధ పంచాయతీల మధ్యను పరస్పరము పనియొక్క సమన్వయమును గురించి ప్రభుత్వమువారికి సలహానిచ్చుట;

(x) జిల్లా పరిషత్తుకు ప్రభుత్వముచే ప్రత్యేకముగా తెలుపబడిన శాసన ప్రోక్తమైన, కార్య నిర్వాహకమైన ఉత్తరువుయొక్క అమలునకు

సంబంధించిన విషయములను గురించి ప్రభుత్వమునకు సలహా నిచ్చుట.

(xi) తనకు అవసరమని తోచునట్టి వివరములను సేకరించుట.

(xii) స్థానిక సంస్థల కార్యకలాపములకు సంబంధించిన గణాంకములను లేక ఇతర సమాచారమును ప్రకటించుట;

(xiii) తన కార్య కలాపములకు సంబంధించిన సమాచారమును పంపవలసినదిగా ఏస్థానికి సంస్థనైనను కోరుట;

(xiv) ఏయే కార్యములకై తన నిధులను ఉపయోగింపవచ్చునో కేవలముగా అట్టి కార్యసిద్ధి నిమిత్తమై ఏర్పాటు చేయబడిన ట్రస్టులను అంగీకరించుట.

(xv) సెకండరి, వృత్తిసంబంధమైన పారిశ్రామిక పాఠశాలలను నిర్వహించుట, విస్తరించుట, లేక క్రొత్తవి స్థాపించుట;

(xvi) ఈ చట్టముయొక్క కార్యములను నిర్వర్తించు నిమిత్తము ప్రభుత్వ పూర్వామోదముతోను నిర్ణయింపబడిన నిబంధనలకు, లోబడియు అప్పుతుచేయుట.

(2) 36వ సెక్షను 3వ సబ్ సెక్షను (vii)వ క్లాజులో తెలుపబడిన ప్రతి బ్లాకు విషయములోను, ఆబ్లాకుకై పంచాయతీ సమితి స్థాపింపబడువరకు, పంచాయతీ సమితియొక్క సమస్త అధికారములను వినియోగించుటకును, కర్తవ్యములను నెరవేర్చుటకును, జిల్లాపరిషత్తుకు అధికారము ఉండవలెను.

(3) జిల్లాపరిషత్తు, ప్రభుత్వ పూర్వామోదముతో ఆజిల్లాలోని పంచాయతీ సమితుల నిధులలోనుండి చందాలను వసూలు చేసుకొనవచ్చును.

## జిల్లా పరిషత్తు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని అధికారములు, కర్తవ్యములు

**48.** (1) జిల్లాపరిషత్తు అధ్యక్షుడు:

(ఎ) జిల్లాపరిషత్తుయొక్కగాని, దానియొక్క ఏస్థాయీసమితియొక్క

గాని తీర్మానములు అమలు జరుపుటకొరకు కార్యదర్శిమీద కార్య నిర్వాహక అధికారము గలిగియుండవలెను.

(బి) జిల్లాపరిషత్తుయొక్క సమావేశములను పిలువవలెను, అధ్యక్షత వహించవలెను, నడుపవలెను.

(సి) జిల్లా పరిషత్తుయొక్క మొత్తము రికార్డును అందుబాటులో యుంచుకొనుటకు వీలుగలిగియుండ వలెను,

(2) ఉపాధ్యక్షుడు, అధ్యక్షుడు ఉత్తర్వుద్వారా తనకు ప్రతిసారి అప్ప జెప్పు అధ్యక్షుని అధికారములు కర్తవ్యములు నిర్వహించవలెను.

(3) అధ్యక్షుని స్థానము ఖాళీగాయున్నప్పుడు, జిల్లాపరిషత్తుయొక్క ఉపాధ్యక్షుడు తిరిగి కొత్త అధ్యక్షుడు ఎన్నుకొనబడే వరకు అధ్యక్షుని అధికారములు వినియోగించవలెను, కర్తవ్యములు నెరవేర్చవలెను.

(4) అధ్యక్షుడు పదునైదు దినములకంటె ఎక్కువకాలము వరుసగా జిల్లాలో లేనప్పుడు లేక 15 దినములకంటె ఎక్కువకాలము ఆయన అశక్తుడు అయినప్పుడు, అట్లు ఆయన లేనట్టి లేక అశక్తుడుగా ఉన్నట్టి కాలమందు ఆయన యొక్క అధికారములు, కర్తవ్యములు ఉపాధ్యక్షునకు సంక్రమించవలెను.

(5) అధ్యక్షుని పదవి ఖాళీగా ఉండిగాని లేక అధ్యక్షుడు 15 దినముల కంటే ఎక్కువకాలము వరుసగా జిల్లాలో లేకుండాయుండిగాని, లేక 15 దినముల కంటే ఎక్కువకాలము ఆయన అశక్తుడై యుండి ఉపాధ్యక్షుని పదవికూడా ఖాళీగా ఉన్నప్పుడు లేక ఉపాధ్యక్షుడు 15 దినములకంటే వరుసగా జిల్లాలో లేనప్పుడు లేక అశక్తుడు అయినప్పుడు, అధ్యక్షునియొక్క అధికారములు, కర్తవ్యములు, జిల్లా పరిషత్తు సభ్యులచే నిర్ణయింపబడిన విధముగా, ఎన్నుకొనబడు సభ్యునకు సంక్రమించవలెను. అట్లు ఎన్నుకొనబడ్డ జిల్లా పరిషత్తు సభ్యుడు "తాత్కాలిక అధ్యక్షుడ"ని వ్యవహరింపబడవలెను. సందర్భమునుబట్టి కొత్త అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు ఎన్నిక అయినట్లు ప్రకటింపబడి పదవిని స్వీకరించువరకు లేక అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని జిల్లాకు తిరిగివచ్చువరకు లేక అశక్తతనుండి

కోలుకొనువరకు, నిర్ణయింపబడు నియమములకు, షరతులకు లోబడి, ఆయన అధ్యక్షునియొక్క అధికారములను వినియోగించ వలెను, కర్తవ్యములను నెరవేర్చవలెను.

## జిల్లా పరిషత్తు కార్యముల విషయములలో సూచించుటకు విడి సభ్యుల హక్కులు.

**49.** జిల్లా పరిషత్తుయొక్క ఏ సభ్యుడైనను, అధ్యక్షునికిగాని, దాని కార్యదర్శికి గాని జిల్లా పరిషత్తు కార్య నిర్వహణములోని నిర్లక్ష్యము, జిల్లా పరిషత్తుయొక్క ఆస్తి దుర్వినియోగము ఎట్టి, స్థానికములయిన అవసరములు, అవసరమని కన్పించే ఏ యితర అభివృద్ధికొరకయిన సూచనలు దృష్టికి తీసుకరాబడవచ్చును.

## జిల్లా కలెక్టరుయొక్క అత్యవసర అధికారములు

**50.** అత్యవసర పరిస్థితులలో, జిల్లా కలెక్టరు సాధారణముగా జిల్లా పరిషత్తు యొక్క లేదా దాని స్థాయీసమితులయొక్క అనుమతిపొందవలసిన కార్యములు వెంటనే అమలు జరుపుటకు ఆదేశింపవచ్చును. అట్టి అత్యవసరముగా అమలు జరుపవలసిన పనులు అట్లు చేయుట అతని అభిప్రాయములో ప్రజా క్షేమములకొరకు అవసరమని తోచినవై యుండవలెను. మరియు అట్టి పనులు అమలు జరుపుటకుగాని, కార్యము నిర్వహించుటకుగాని అగు ఖర్చు జిల్లా పరిషత్ నిధిలోనుంచి ఖర్చు పెట్టవలసినదిగా ఆదేశించవలెను.

(2) ఈ సెక్షను ప్రకారము అట్టి అధికారమును వినియోగించిన ప్రతి సందర్భములోను, జిల్లా కలెక్టరుచేత వెంటనే ప్రభుత్వమువారికి, అట్టి చర్యకు కారణములతో సహా ఒక రిపోర్టు నివేదించవలెను. దాని ప్రతి ఒకటి జిల్లా పరిషత్తుకు సమాచారము తెలియుటకు పంపవలెను,

## అధికారులయొక్కయు ఇతర ఉద్యోగులయొక్కయు, పదవులను సృష్టించుట, ఆ పదవులలో నియామకములు చేయుట మున్నగునవి.

**51.** (1) ప్రతి జిల్లా పరిషత్తుకూడ ప్రభుత్వ పూర్వామోదముతో ఈ చట్టపు కార్యములను నిర్వర్తించుటకుగాను తనకు అవసరమని తోచునట్టి అధికారులు

మరియూ ఇతర ఉద్యోగుల పదవులను సృష్టించుటకు అధికారము కలిగియుండ వలెను.

(2) ప్రభుత్వమువారు, ఈ చట్టముయొక్క పనులను నిర్వర్తించు నిమిత్తము అవసరమని తాము భావించునట్టి పదవులను ఎప్పుడైనను సృష్టింప వచ్చును.

(3) (1) (2) సబ్ సెక్షనులో ననుసరించి సృష్టింపబడిన పదవులలో నియామకములన్నియూ, ఆపదవులలోనున్న వ్యక్తుల బదిలీలును నిర్ణయింపబడిన విధానమున చేయబడవలెను.

(4) ఈ సెక్షననుసరించి నియమింపబడిన అధికారులును, తదితర ఉద్యోగులును నిర్ణయింప బడిన నియమములకులోబడి జిల్లా పరిషత్తు అధ్యక్షుని పరిపాలనా నియంత్రణక్రింద ఉండవలెను.

## జిల్లా పరిషత్తు, దానిస్థాయీ సమితియొక్క సభ్యుల బత్తెములు.

**52.** (1) ఒక జిల్లా పరిషత్తు లేక దాని స్థాయీ సమితీయొక్క అనధికార

1959 లోని 35వ ఆంధ్రప్రదేశ చట్టముయొక్క 53వ విభాగపు సవరణ:

1959 ఆంధ్రప్రదేశ పంచాయితీసమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35 వ ఆంధ్రప్రదేశ చట్టము) యొక్క 53 వ సెక్షన్‌లోని 2 వ సబ్ సెక్షనునకు బదులు ఈ క్రింది ఉప విభాగమును ఉంచవలెను. అదేదనగా :-

"(2) జిల్లా పరిషత్తుకు ముట్టిన పైకములన్నియు అత్యంత సమీపములో ఉన్న ప్రభుత్వ ట్రెజరీలోగాని, ప్రభుత్వమువారి అనుమతిపొంది, వారిచే ఆమోదింపబడిన ఏదేని బ్యాంకులోగాని ఉంచబడవలెను."

పరుపబడినట్టి కార్యములకొరకును, నిర్ణయింపబడ్డ తదితరకార్యముల కొరకును నిర్ణయింపబడిన విధముగా వినియోగింప బడవలెను.

(2) జిల్లాపరిషత్తుచేత వసూలుచేయబడ్డ ధనమంతయు స్టేటుబ్యాంకులో గాని, ప్రభుత్వమువారి మంజూరీతో, వారిచే ఆమోదింపబడిన మరొక బ్యాంకులో గాని ఉంచవలెను.

(3) జిల్లా పరిషత్తు నిధిమీదట ఈయబడు ఆర్డరులపైనను, చెక్కుల పైనను కార్యదర్శి సంతకము చేయవలెను.

## జిల్లాపరిషత్తుయొక్క ఆదాయ వ్యయములు.

**54.** (1) జిల్లాపరిషత్తుయొక్క ఆదాయ మార్గములలో ఈక్రింద చెప్పబడినవి చేరవలయును.

(i) జిల్లాపరిషత్తుకు కేటాయింపబడిన కేంద్ర లేక రాష్ట్రప్రభుత్వ నిధులు.

(ii) కుటీర, గ్రామీణ, లఘుపరిశ్రమలు మున్నగువాటి అభివృద్ధి కొరకు అఖిలభారత సంఘములు, సంస్థలు ఇచ్చుగ్రాంట్లు.

(iii) భూమిపన్ను లేక స్థానికపన్ను, రాష్ట్రపు పన్నులు, రుసుములలో నుండి నిర్ణయింపబడినట్టి భాగము.

(iv) ఏశాసనము ననుసరించియైనను జిల్లాపరిషత్తు విధింపగల పన్నుల రుసుములవలనవచ్చు ఆదాయము.

v జిల్లా పరిషత్తుచేత నిర్వహింపబడు ధర్మాదాయములు, మరియు ట్రస్టులవలన వచ్చు ఆదాయము.

vi జిల్లా బోర్డుయొక్క ఆదాయములలోనుండి ప్రభుత్వమువారు ఉత్తరముద్వారా కేటాయించు ఆదాయము.

vii 36వ సెక్షనుయొక్క [3] వ సబ్ సెక్షనుయొక్క [vii] వ క్లాజులో చెప్పబడిన ప్రతి బ్లాకుయొక్క ఆదాయము.

viii పంచాయితీ సమితులుగాని ప్రజలుగాని ఏరూపమునైననూ ఇచ్చు విరాళములు, ద్రవ్యసహాయములు.

(x) ప్రభుత్వమువారి పూర్వామోదముతో పంచాయితీ సమితులవద్ద జిల్లా పరిషత్తులు వసూలు చేయునట్టి చందాలు,

(2) జిల్లా పరిషత్తుయొక్క ఖర్చులలో, దానిక్రింద పనిచేయు అధి కారుల ఇతర ఉద్యోగులయొక్క జీతములు, బత్తెములు, 52వ సెక్షను క్రింద చెల్లింపవలసిన బత్తెములు, ఈ చట్టముయొక్క కార్యములను నిర్వర్తించు నిమిత్తము ప్రభుత్వముచే ఆదేశింప బడు ఏ ఖర్చుపద్దు అయినను, అట్టి కార్యముల నిమిత్తము అవసరమగు తదితరమైన ఖర్చులును చేరవలయును.

జిల్లా పరిషత్తు బడ్జెటు.

**55.** (1)జిల్లా పరిషత్తుయొక్క కార్యదర్శి ప్రతిసంవత్సరము, వచ్చే సంవత్సర కాలమున సంభావ్యమైన ఆదాయ వ్యయములను చూపుచూ బడ్జెటును తయారు చేసి జిల్లా పరిషత్తు ముందు ఉంచవలయును. జిల్లాపరిషత్తు తాను సరి అయినవని ఉద్దేశ్యపడు మార్పులేమైన ఉన్నచో ఆ మార్పులనుచేసి, బడ్జెటును మంజూరు చేయవలెను.

(2) ఆ విధముగా మంజూరుకాబడిన బడ్జెటును జిల్లాపరిషత్తు కార్యదర్శిచేత ప్రభుత్వము వారికి, అధ్యక్షుని ద్వారా ప్రభుత్వమువారు నిర్ణయించునట్టి తేదీన లేక తేదికి ముందుగా సమర్పింపవలయును. అందులో సరిపోయినంతటి కేటా యింపు చేయబడలేదని లేక ఈ చట్టముయొక్క నిబంధనలను అమలుపరుచుటకు గాను ఇతర విధముగా అసంతృప్తి కరముగా ఉన్నదనిగాని ప్రభుత్వమువారు సంతృప్తి పడినచో, వారు తాము అవసరమని భావించు రీతిగా ఆ బడ్జెటును మార్చవచ్చును.

(3) ఒక సంవత్సర కాలమున జిల్లా పరిషత్తు ఆదాయముల విషయ ములోగాని, ఈ చట్టముయొక్క ప్రయోజనముల కొరకుగాను ఖర్చుపెట్టబడ

వలసిన మొత్తములపంపిణీ విషయములోగాని బడ్జెటులో పైమార్పులు చేయవల సిన అవసరమున్నదని అది తలంచిన 1, 2 సబ్ సెక్షనులలో నిబంధింపబడిన విధముగా ఒక అనుబంధపు బడ్జెటు తయారు చేయబడవచ్చును, మంజూరు చేయబడవచ్చును, మరియు మార్చబడవచ్చును.

## అకౌంట్లు - ఆడిట్లు.

**56.** జిల్లా పరిషత్తుయొక్క అకౌంటులకు, ఆడిట్టుకు, యధోచితమైన మార్పులతో 32వ సెక్షనుయొక్క నిబంధనలే వర్తింపవలెను.

## జిల్లా పరిషత్తు అధ్యక్షునిపైగాని ఉపాధ్యక్షునిపైగాని అవిశ్వాస తీర్మానం.

**57.** 33 వ సెక్షనులోని నిబంధనములు, ఈ క్రింద చేయబడిన మార్పులకు లోబడి, జిల్లా పరిషత్తుయొక్క అధ్యక్షునిలోను, ఉపాధ్యక్షునిలోను అవిశ్వాస తీర్మానమునకు వర్తించవలెను. అవి :—

(i) "పంచాయతీ సమితి" "అధ్యక్షుడు" "ఉపాధ్యక్షుడు" మరియు "కలెక్టరు" అను పదములు ఎక్కడ వచ్చినను, సందర్భమును బట్టి "జిలా పరిషత్తు" "అధ్యక్షుడు" ఉపాధ్యక్షుడు" మరియు "జిల్లా కలెక్టరు" అను పదములు మార్పు చేసుకొనవలెను.

(ii) 10వ సెక్షనులో "మరియు అతను దానిమీద వోటు చేయుటకు అనర్హుడై యుండవలెను" అనుమాటలకు "కాని అతను దానిమీద ఓటు చేయుటకు అర్హుడై యుండవలెను" అని మార్పు చేసు కొనవలెను.

## జిల్లా పరిషత్ అధ్యక్షుని, ఉపాధ్యక్షుని తొలగించుటకు ప్రభుత్వ మువారి అధికారము.

**58.** 34వ సెక్షనులోని నిబంధనములు, క్రింద చెప్పబడ్డ మార్పులకులోబడి,

ప్రభుత్వమువారిచేత జిల్లాపరిషత్ అధ్యక్షుని లేక ఉపాధ్యక్షునియొక్క తొల గింపుకు వర్తింపవలెను. అది ఏమన:- "పంచాయతీ సమితి" "అధ్యక్షుడు" "ఉపాధ్యక్షుడు" అనుపదములకుబదులు "జిల్లాపరిషత్" "అధ్యక్షుడు" మరియు "ఉపాధ్యక్షుడు" అని సందర్భమునుబట్టి మార్పుచేసుకొనవలెను.

*షరా :--- ఇంగ్లీషు భాషలో పంచాయతీ సమితి అధ్యక్షునకు ప్రెసిడెంటు అనియు, ఉపాధ్యక్షునికి వైస్ ప్రెసిడెంటు అనియూ, జిల్లా పరిషత్ అధ్యక్షునికి చైర్‌మన్ అనియూ ఉపాధ్యక్షునకు వైస్ చైరమన్ అనియూ వాడుటచే మార్పు అవసరము వచ్చినదిగాని తెలుగులో అట్టి అవసరములేదు)*

# 4వ అధ్యాయము

## వివిధాంశములు

### జిల్లా బోర్డులో అధికారములను, కర్తవ్యములను పంచాయితీ సమితులకు, జిల్లా పరిషత్తులకు బదిలీచేయుట

**59.** (1) దీనికి సంబంధించిన జిల్లాబోర్డుల చట్టమునందు, లేక ఏదైనా ఇతర శాసనమునందు ఏమియున్నప్పటికీ దానితో నిమిత్తములేకుండ, ప్రభుత్వమువారు ప్రకటనద్వారా, మరియు అందు పేర్కొనబడినట్టి నియంత్రణము, నిర్బంధములు, షరతులు, మినహాయింపులు మొదలగువానికి లోబడి, సంబంధించిన జిల్లా బోర్డుల చట్టము లేక దానిక్రింద లేక ప్రస్తుతము అమలులో ఉన్న ఏ యితర శాసనముద్వారాగాని ఒక జిల్లాబోర్డుచే వినియోగింపబడదగు అధికారములను లేక నిర్వహింపబడదగు కర్తవ్యములను, ఏదైనా పన్నును లేక రుసుమును వసూలుచేయు అధికారముతో సహా ఒక పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తుకు బదిలీ చేయబడవలసినదిగా ఆదేశింపవచ్చును. మరియు అందుమీదట ఆ పంచాయతీ సమితి లేదా జిల్లా పరిషత్తు తనకు బదిలీ చేయబడిన అధికార ములను, కర్తవ్యములను ఉపయోగింపవలయును, నిర్వర్తింపవలయును. అప్పటి నుంచి ఆ అధికారములు, కర్తవ్యములు జిల్లాబోర్డుచే ఉపయోగింపబడుటయు, నిర్వర్తింపబడుటయు విరమించవలెను.

(2) 1వ సబ్ సెక్షను క్రింద ఏదైనా అధికారములను, కర్తవ్యములను జిల్లాబోర్డునుంచి పంచాయతీ సమితికి లేక జిల్లాపరిషత్తుకు బదిలీ చేయబడినప్పుడు ప్రభుత్వమువారు, వారు అవసరమని తలచిన జిల్లాబోర్డు అధికారులను, యితర ఉద్యోగులను సందర్భమును బట్టి పంచాయతీ సమితికిగాని, లేక జిల్లా పరిషత్తుకుగాని బదిలీ చేయుటకు ఆదేశము చేయవచ్చును.

(3) 1వ సబ్ సెక్షను ననుసరించి జిల్లాబోర్డుయొక్క ఏదేని అధికారములు, కర్తవ్యములు, పంచాయితీ సమితికి, లేక జిల్లా పరిషత్తుకు బదిలీ చేయబడినప్పుడు, అప్పటికి అమలులోయున్న ఏ శాసనములోనైనను అట్టి అధికారములను కర్తవ్యములను పురస్కరించుకొని జిల్లాబోర్డును గురించి చేయబడిన ప్రస్తావనలన్నియూ పంచాయతీ సమితిని లేక సందర్భానుసారముగా జిల్లా పరిషత్తును గురించిన ప్రస్తావనముగా అన్వయించుకొనవలెను.

## జిల్లాబోర్డు రద్దుచేయుట.

**60.** (1) ప్రభుత్వమువారు సంబంధించిన జిల్లాబోర్డు చట్టములో లేక అప్పటికి అమలులోయున్న ఏ యితరశాసనములో ఏమి చెప్పబడి యున్నప్పటికీ, ప్రకటనద్వారా, దానిలో నిర్ణయింపబడిన తేదీనుండి, రాష్ట్రములోయుండే ఏ జిల్లా బోర్డునైనను రద్దుపరచవచ్చును.

(2) 1వ సెక్షను క్రింద జిల్లా బోర్డును రద్దుచేసినప్పుడు, ఆ తేదీన సంబంధించిన జిల్లాబోర్డు చట్టము లేక ఏదేని యితర శాసనముక్రింద దానికి ఆస్తులు అప్పులు అన్నియూ ఆ జిల్లాయొక్క జిల్లా పరిషత్తునకుగాని, దానిలో పంచాయతీ సమితులకుగాని లేక ఆ రెండింటికిగాని ప్రభుత్వమువారు ఉత్తరువు ద్వారా ఆదేశింపగల మేరకు మరియు అట్టివిధముగా సంక్రమింపవలయును.

(3) రద్దుచేయబడిన జిల్లాబోర్డుయొక్క అధికారులు, ఇతర ఉద్యోగులను జిల్లా పరిషత్తు లేక పంచాయతీ సమితుల సిబ్బందిలో లేదా ప్రభుత్వము ఉచితమని భావించిన యింకొక విధముగా చేర్చుకొనవలయును.

సంబంధించిన జిల్లాబోర్డుల చట్టము, పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు వర్తించుట.

**61.** (1) ప్రభుత్వమువారు ప్రకటనద్వారా, ఏదేని పన్ను లేక రుసుములను విధించుటకు, వసూలు చేయుటకు సంబంధించిన నిబంధనలను కలుపుకొని, సంబంధించిన జిల్లాబోర్డుల చట్టముయొక్క ఏయే నిబంధనలు ఆ ప్రకటనలో నిర్దిష్టింపబడునో, ఆ నిబంధనలు ఈ చట్టముక్రింద ఏర్పరుపబడగల పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు వర్తింపచేయుటకు సులభసాధ్యము చేయు నిమిత్తము ప్రభుత్వమువారు ప్రకటనద్వారా, సంబంధించిన జిల్లాబోర్డుల చట్టమును మరియు దానిక్రింద చేయబడిన విషయములను అందులో ఉన్న ఏ నిబంధన నయినా రద్దుచేయుట, సవరించుట లేక తాత్కాలికముగా ఆపుచేయుట మూలముగా అవసరమైనట్లు సానుకూలీకరించు కొనవచ్చును లేక మార్పుచేయవచ్చును, మరియు అందుమీదట సంబంధించిన జిల్లా బోర్డుల చట్టము మరియు ఆ చట్టముక్రింద చేయబడిన నియమములు, అవిధముగాచేయబడిన సానుకూలీకరణలకు లేక మార్పులకు లోబడి అమలులో ఉండవలయును.

(2) సంబంధించిన జిల్లాబోర్డుల చట్టముయొక్క నిబంధనల లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమముల సానుకూలీకరణ కొరకు [1] వ ఉపభాగముననుసరించి ఎట్టి నిబంధనయు చేయకుండినను లేక సరిపోని నిబంధన చేయబడినను, దానితో నిమిత్తము లేకుండా, ఈ నిబంధనలను ఏదేని పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తుకు వర్తింపచేయుటను సులభ సాధ్యము చేయు నిమిత్తము ఆ నిబంధనలను అమలు పరుచుటకు కోరబడిన లేక అధికారమీయబడిన న్యాయస్థానము, ట్రిబ్యునలు లేక అధికారవర్గము, ఆ న్యాయస్థానము ట్రిబ్యునలు లేక అధికారవర్గము సమక్షమున నున్న విషయమునకు అవసరము కాగల, లేక ఉచితముకాగల విధముగా ఆ నిబంధనలను, వాటి భావమును మార్చకుండ, అన్వయము చేయవచ్చును.

పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు తీర్మానమును రద్దుచేయుటకు లేక తాత్కాలికముగా ఆపియుంచుటకు అధికారము.

**62.** (1) పంచాయతీ సమితిచేగాని, దానికి సంబంధించిన ఏదైనా స్థాయీ

సమితిచేగాని, ఆమోదింపబడిన తీర్మానము, ప్రభుత్వమువారి ఉద్దేశ్యములో అట్టి తీర్మానము;

(ఎ) చట్ట సమ్మతముగా ఆమోదింపబడలేదని;

(బి) ఈ చట్టముచే, లేక ఈ చట్టముక్రింద ఈయబడిన అధికారములను మించినట్టిదిగా లేక వాటిని దుర్వినియోగ పరచునట్టిదిగా ఉన్నదని;

(సి) దానిని అమలు జరిపిన మానవ జీవనమునకు, ఆరోగ్యమునకు, లేక క్షేమమునకు హాని కలుగగల అవకాశమున్నదని లేక అది సంఘర్షణకు గాని, కలహమునకుగాని దారితీయగల అవకాశమున్నదని, అభిప్రాయపడిన, వారు వ్రాతపూర్వకమైన ఉత్తరువుద్వారా దానిని రద్దుచేయవచ్చును.

(2) (1)వ సబ్ సెక్షను క్రింద ప్రభుత్వము చర్యతీసికొనుటకు ముందుగా పంచాయతీకిగాని, జిల్లా పరిషత్తుకుగాని, సంజాయిషీ చెప్పుకొనుటకు అవకాశము ఇవ్వవలెను.

(3) (1)వ సబ్ సెక్షనుయొక్క క్లాజు (సి)లో చెప్పబడిన సందర్భముల నాధారముచేసికొని ఏదైనా ఒక తీర్మానమును తాత్కాలికముగా ఆపుచేయుట అత్యవసరమని జిల్లా కలెక్టరు అభిప్రాయపడినచో, ఆయన వ్రాతపూర్వకమైన ఉత్తరువుద్వారా అట్టి తీర్మానమును తాత్కాలికముగా ఆపుచేయవచ్చును. మరియు ఆవిషయం ప్రభుత్వమునకు తెలియజేయ వలెను.

(4) (3)వ సబ్ సెక్షను ననుసరించి ఉత్తరువు ఏవిషయమున చేయబడినదో ఆ విషయమునకు సంబంధించిన రికార్డును ప్రభుత్వమువారు స్వయముగా గాని, ఆ ఉత్తరువు వలన నష్టపడిన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు కోరిన మీదటగాని తెప్పించుకొని, దానిపై వారు యుక్తమని తలచెడి ఉత్తరువును జారీచేయవచ్చును; అయితే సంజాయిషీ చెప్పుకొనుటకు పంచాయతీ సమితిగాని, జిల్లా పరిషత్తుగాని అవకాశము ఈయనిదే దానికి విరుద్ధమైన ఎట్టి ఉత్తరువునుకూడా జారీ చేయరాదు.

పంచాయతీ సమితిని, జిల్లా పరిషత్తునుగానిరద్దుచేయుట, విఘటన గాని చేయుటకు ప్రభుత్వముయొక్క అధికారము.

**63.** ఏ సమయములో నైనను, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు తన అధికారములను వినియోగింపనట్లు, లేక తన కర్తవ్యములను నిర్వర్తింపనట్లు, లేక ఈ చట్టముగాని, ప్రస్తుతము అమలులో ఉన్న ఏదైనా ఇతర శాసనముచే లేక దాని క్రింద ఇవ్వబడిన అధికారములను అధిగమించినట్లు లేక దుర్విని యోగ పరచినట్లు ప్రభుత్వమువారికి తోచినచో ప్రభుత్వమువారు ఆ తప్పును, ఆ అధిగ మించుటను లేక దుర్విని యోగపరచుటను సరిచేసు కొనవలసినదిగా, లేక అందునిమిత్తము సంతృప్తికరమగు సంజాయిషీ ఈయవలసినదిగా ఆ పంచా యతీ సమితిని లేదా ఈ సందర్భమునుబట్టి ఆ జిల్లా పరిషత్తును ఆదేశింప వచ్చును. మరియు, ఆ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు అట్టి ఆదేశాను సారముగా వర్తింపనిచో ప్రభుత్వమువారు ఆ పంచాయతీ సమితిని లేదా సంద ర్భమునుబట్టి ఆ జిల్లా పరిషత్తును ఒక నిర్ణీత తేదీనుండి ఒక సంవత్సరము వరకు రద్దు చేయవచ్చును లేదా ఒక నిర్ణీత తేదీనుంచి దానిని విఘటన చేయ వచ్చును. మరియు, దానిని వెంటనేకాని వేరొక నిర్ణీత తేదీనుండిగాని, పునః స్థాపింప వచ్చును. మరియు ప్రభుత్వమువారు అందుకొరకుగాను అది రద్దుఅయి యున్న కాలములో లేదా ఈ చట్టపు నిబంధనలకు అనుగుణముగా పంచాయతి సమితి లేక జిల్లా పరిషత్తు తిరిగి స్థాపింప వచ్చును. మరియు, ప్రభుత్వమువారు అందుకొరకుగాను అది రద్దు అయియున్న కాలములో లేదా ఈ చట్టపు నిబం ధనలకు అనుగుణముగా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు తిరిగి స్థాపింపబడు నంతవరకు ప్రభుత్వము వారిచే ఇందునిమిత్తమై నియమింపబడు నట్టి వ్యక్తిలేక అధికార వర్గము ఆ పంచాయతీ సమితియొక్క లేక జిల్లా పరిషత్తుయొక్క ఏ పైన చెప్పిన లేక అన్ని అధికారములను, కర్తవ్యములను, వినియోగించునట్లు, నిర్వర్తించునట్లు చేయవచ్చును. మరియు ఆవిధముగా విని యోగింపబడిన ఎవరైనావ్యక్తి లేదా అధికారవర్గమువారు ఆవిధముగా ఆదేశించి నచో, పంచాయతీ సమితియొక్క లేదా సందర్భమును బట్టి జిల్లా పరిషత్తు యొక్క నిధులలోనుండి తాము చేసిన పనికిప్రతిఫలము స్వీకరింపవచ్చును.

పంచాయసతీమితి, జిల్లా పరిషత్తు చర్యలు లాంఛన ప్రకారముగా యుండకపోవుట ఖాళీలు ఏర్పడుటవలన చెల్లనివిగా యుండవు.

64 (1) పంచాయతీ సమితియొక్క లేక స్థాయీసమితియొక్క ఏచర్యయైనను అట్టి పంచాయతీ సమితి లేక స్థాయీసమితి లోని ఏర్పాటులో లోపము గలదనే కారణముచేత, లేక ఆ పంచాయతీసమితియొక్కగాని, స్థాయీ సమితియొక్కగాని అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, లేక ఎవరైనా సభ్యుడు ఏదైనా అనర్హతల వలన లేక సందర్భానుసారముగా అతని నామ నిశ్చయముతో, సహసభ్యునిగా చేసికొనుటలో లేక ఎన్నికలలో ఏదైనా క్రమరాహిత్యము లేక శాసన వైరుధ్యము వలన ఆ పదవిని స్వీకరించుటకు లేదా ఆ పదవియందు ఉండుటకు అయనకు హక్కు లేదను ఆధారముపై గాని లేక ఆ చర్య ఆపంచాయతీ సమితి యొక్క స్థాయీ సమితియొక్క అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, చెయిర్మను, లేక ఎవరైనా సభ్యుని పదవియందు ఏదైనా ఖాళీ ఏర్పడియున్న కాలములో చేయబడినదను కారణముచేతగాని, చెల్లనిదయినట్లు భావింపబడరాదు.

(2) 1 వ సబ్ సెక్షనులోని నిబంధనలు జిల్లా పరిషత్తుయొక్క లేక స్థాయీ సమితియొక్క చర్యలకు కూడా వర్తింపవలయును,

సభ్యులు తీసుకొనవలసిన ప్రమాణము

65. (1) పంచాయతీ సమితియొక్క ప్రతి సభ్యుడును జిల్లా పరిషత్తుయొక్క ప్రతి అనధికార సభ్యుడును ఆయన స్థానమును ఆక్రమించుటకు పూర్వము సంభర్భమునుబట్టి పంచాయతీ సమితి, లేక జిల్లాపరిషత్తు సమావేశమందు, తాను ఈ క్రింద చూపబడిన నమూనా ప్రకారం, భారత రాజ్యాంగ విధానమునకు విధేయత తెలిచేయు ప్రమాణముగాని, శపథముగాని చేయవలెను.

(1) పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్తుయొక్క సభ్యుడైన ......... .................అనునేను చట్ట రీత్యాచేయబడిన భారత రాజ్యాంగ విధానము పట్ల విశ్వాస విధేయతలు కలిగి యుందుననియు, నేను స్వీకరింపబోవుచున్న విధిని విశ్వసనీయముగా నిర్వహింపగలననియు భగవత్సాక్షిగా ప్రమాణము చేయుచున్నాను, లేక త్రికరణ శుద్ధిగా శపథము చేయుచున్నాను.

(2) అట్టి యే సభ్యుడైనను తన పదవీకాలము ఆరంభమగు తేదీనుండి మూడు నెలలోపున లేదా, సదరు తేదీ తర్వాత జరిగిన మూడు సమావేశములలో ఏ సమావేశములోనైనను—ఈ రెండిటిలో ఏది తర్వాత జరిగిన అప్పుడు (1) వ సబ్ సెక్షనులో నిర్దిష్టపరుపబడిన విధముగా ప్రమాణము లేక శపధము చేయకున్నచో, ఆయన పదవిలో నుండుట విరమింపవలయును మరియు ఆయన స్థానము ఖాళీ అయినట్లు భావింపవలయును,

(3) అట్టి ఏ సభ్యుడైనను, యీ సెక్షనులో నిర్దిష్టపరుపబడిన విధముగా ప్రమాణము లేక శపథము చేసిన తప్ప, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు యొక్క సమావేశములో కూర్చుండరాదు, అట్టి సభ్యుడుగా ఎట్టిచర్యయు చేయరాదు.

## పరిపాలనా నివేదిక

**66.** (1) ప్రతి సంవత్సరాంతము నందును నిర్ణయింపబడిన నమూనాలో మరియు వివరములతో ప్రతి పంచాయతీ సమితియు జిల్లాపరిషత్తుకు, ప్రతిజిల్లా పరిషత్తు ప్రభుత్వమునకు, ప్రతి సంవత్సరము తన పరిపాలనకు సంబంధించిన నివేదికను సమర్పింపవలెను. పంచాయతీ సమితి జిల్లాపరిషత్తునకు సదరు నివేదికను సమర్పించునప్పుడు, దాని నకలు నొకదానిని ప్రభుత్వమునకు పంపవలెను.

(2) జిల్లాపరిషత్తు ప్రతి పంచాయతీ సమితియొక్క నివేదికను పరిశీలించవలయును. మరియు తన అభిప్రాయములతోపాటు దానిని ప్రభుత్వము వారికి అందచేయవలెను,

(3) పంచాయతీ సమితియొక్క నివేదికను బ్లాకు డెవెలప్మెంటు ఆఫీసరుయును, జిల్లాపరిషత్తు నివేదికను దాని కార్యదర్శియును తయారుచేయవలయును. మరియు పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్తు దానిని పరిశీలించి, దానిపై తన తీర్మానముతోపాటు సందర్భమునుబట్టి జిల్లా పరిషత్తుకు లేదా ప్రభుత్వమువారికి అందచేయవలెను.

తనిఖీచేయు అధికారుల ప్రవేశమునకు అధికారములు.

**67.** (1) దీనికొరకు ప్రభుత్వమువారు అధికారమీయగల ఎవరైనా ఒక అధికారి లేక వ్యక్తి ఈ దిగువ పేర్కొన్న స్థలములలో ప్రవేశింపవచ్చును, మరియు తనిఖీచేయవచ్చును.

(ఎ) ఏదేని పంచాయతీ సమితియొక్క లేక జిల్లాపరిషత్తుయొక్క ఆధీనములోగల ఎట్టి స్థిరాస్తి లేదా వారి ఆధీనమున నిర్వహింపబడుచున్న ఏదేనిపని, పథకముల ప్రాజెక్టు.

(బి) ఏదేని పంచాయతీసమితి లేక జిల్లాపరిషత్తు నిర్వహించుచున్న లేక దానిఆధీనములోనున్న ఏదైనాపాఠశాల, ఆస్పత్రి దవాఖానా, ఆసుపత్రి టీకాల కేంద్రము, సత్రము లేకఇతరసంస్థ, మరియు అట్టిసంస్థలోగల ఏ వైనా రికారులు, రిజిష్టర్లు లేక ఇతర డాక్యుమెంట్లు మరియు,

(సి) పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్తుయొక్క కార్యాలయము, మరియు దానియందుగల ఏవేని రికార్డులు, రిజిష్టర్లు లేక ఇతర డాక్యుమెంట్లు.

(2) (1)వ సబ్ సెక్షనులో తెలుపబడిన అధికారికి లేక వ్యక్తికి, సదరు సబ్ సెక్షనులో క్రింద తన కర్తవ్యములను, నిర్వర్తింపజాలుటకు అవసరమైన ప్రకారముగా పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్తు తన ఆస్తిని ఆవరణలను, సమస్తమైన డాక్యుమెంట్లను సరిఅయిన అన్నివేళలందు విధిగా అందుబాటులో ఉంచవలెను,

సద్భావముతో చేయబడిన చర్యల విషయమున రక్షణ.

**68.** ఈచట్టము ననుసరించి లేక ఈ చట్టముక్రింద చేయబడిన నియమముల ననుసరించి సద్భావముతో చేయబడిన లేక చేయనుద్దేశింపబడిన ఏచర్యను పురస్కరించుకొనియైనను ఏవ్యక్తిపైగాని ఎట్టిదావాగాని అభియోగముగాని తదితర చట్టబద్ధ చర్యగాని ఆరంభింపబడరాదు,

### నియమములను చేయు అధికారము.

**69.** (1) ఈ చట్టముయొక్క కార్యములను నిర్వర్తించుటకు ప్రభుత్వము వారు ప్రకటనద్వారా నియమములను చేయవచ్చును.

(2) ఈ సెక్షను ననుసరించి చేయబడిన సమస్త నియమములు, అది చేయబడినతరువాత సాధ్యమైనంతతొందరగా రాష్ట్రశాసన సభలరెండింటిముందు కనీసము 14 రోజులుపాటు ఉంచబడవలెను. మరియు అవి అట్లు వుంచబడిన సమావేశకాలమునందు రాజ్య శాసనసభచే రద్దుచేయుట గాని, సవరణ చేయుట గాని, మార్పులకు లోనై యుండవలెను.

### పంచాయతీ సమితికి జిల్లా పరిషత్తుకు ఉప నిబంధనల చేయు అధికారము.

**70** (1) ముందు చేయబడినట్టి నియమములకు లోబడి, ఒక పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు అమోదముతోను, మరియు జిల్లా పరిషత్తు ప్రభుత్వ ఆమోదముతోను, దేనికొరకై స్థాపించబడినదో దాని ఏదైనా కర్తవ్యముల నిర్వర్తించుటకై ఉప నిబంధనలు చేయవచ్చును.

(2) ఈ సబ్ సెక్షను ననుసరించి ఉప నింబంధనలను చేయుటకు, వాటిని ప్రచురణ, మరియు అమలు లోనికి రావలసిన తేదీకి సంబంధించిన కార్యవిధానమును గూర్చి నియమములను చేయు అధికారము ప్రభుత్వమునకు ఉండవలెను.

### అధికారప్రదానము; సంస్థలను, పసులను బదిలీ చేయుటకు అధికారము.

**71** (1) ప్రభుత్వమువారు, ప్రకటన ద్వారా ఈ సెక్షను మరియు 69 వ సెక్షనుల వలన తమకు సంక్రమించిన అధికారములను మినహా, ఈ చట్టము యొక్క అన్ని, లేదా ఏవైనా అధికారములను తమ క్రింద ఎవరైన వ్యక్తికి గాని, అధికారవర్గమునకు గాని సంక్రమింపచేయవచ్చును. మరియు అదేవిధము

గాఅట్లు సంక్రమింపజేసిన ఏదైనా అధికారమును ఉపసంహరించు కొనవచ్చును. ఈసబ్ సెక్షన్ క్రింద సంక్రమింపచేయబడిన ఏదైనా అధికారముల వినియోగము, ప్రకటనలో నిర్దిష్ట పరుపబడునట్టి అధికారిచే చేయబడు నిర్బంధములకున్నూ ఆజమాయిషీ మరియు మార్పులకును, షరతులకును లోబడి యుండవలెను.

(2) ఈ చట్టముయొక్క నిబంధనలచే లేదా వాటి ననుసరించి ఏవైనా అధికారములను వినుయోగించునట్టి లేదా కర్తవ్యములను నిర్వహించుచున్నట్టి పంచాయతీ సమితిగాని, జిల్లాపరిషత్తుగాని, ఇతర వ్యక్తిగాని దానియొక్క లేదా అతని యొక్క అధికారములను లేక కర్తవ్యములను ఎవరైనా వ్యక్తికిగాని లేదా అధికార వర్గమునకుగాని, సంక్రమింపచేయవచ్చును; అయితే అట్టి ప్రదానము, నిర్ణయింపబడ్డ నిర్బంధములకు పరిమితులకు, షరతులకును మరియు ప్రభుత్వము వారు చేయు అజమాయిషీ మరియు మార్పులకు లోబడి యుండగలదు.

(3) ప్రభుత్వమువారు తమ నిర్వహణక్రింద లేక నియంత్రణ క్రింద ఉన్న ఏదైనా సంస్థను లేక పనిని జిల్లా పరిషత్తు తన నిర్వహణక్రింద లేక నియంత్రణక్రింద ఉన్న ఏదైనా సంస్థను లేక నిర్మాణమును ఏదైనా పంచాయతీ సమితికి, పంచాయతీకి, లేక పట్టణ సమితికి బదిలీ చేయవచ్చును, ఈ బదిలీ ప్రభుత్వమునకుగాని, సందర్భానుసారముగా జిల్లా పరిషత్తునకుగాని, నిర్దిష్టపరుపబడునట్టి షరతులకును, పరిమితులకును, నిర్బంధములకును లోబడిజరుగవలెను.

అయితే, ఏబదిలీకూడా, దానికి సంబంధించిన జిల్లాపరిషత్తుయొక్కగాని, పంచాయతీ సమితియొక్కగాని, లేక పట్టణసమితియొక్కగాని, పూర్వ ఒప్పుదల పొందనిదే చేయకూడదు,

### ప్రభుత్వమునకు మార్పుచేయుటకు, సమీక్షించుటకు అధికారము

**72.** (1) ప్రభుత్వము స్వయముగా గాని లేదా స్వప్రయోజనముగల వ్యక్తి అర్జీపెట్టుకొనినచోగాని ఏదైనా పంచాయతీ సమితి లేదా జిల్లాపరిషత్తు లేదా వాటి స్థాయీసమితుల వద్దనుండి ఏవైనా ప్రొసీడింగులకు సంబంధించిన రికార్డులను, అట్టిప్రొసీడింగుల సక్రమత్వమును లేదా అందులో చేయబడిన ఏదైనా నిర్ణయము

లేదా జారీచేయబడిన ఉత్తరువుయొక్క నిర్దుష్టత్వమును, న్యాయసమ్మతత్వమును లేదా ఔచిత్యమునుగూర్చి తాము సంతృప్తి చెందు నిమిత్తము తెప్పించుకొనవచ్చును, పరీక్షింపవచ్చును. మరియు ఏసందర్భములోనైనను అట్టి ఏదేని నిర్ణయము లేక ఉత్తరువు మార్చబడవలెనని, రద్దుచేయబడవలెనని, ఆపివేయబడవలెనని, లేదా తిరిగి విచారణకు పంపించబడవలెనని ప్రభుత్వమువారికి తోచినచో, ఆ విధముగా వారు ఉత్తరువులను జారీ చేయవచ్చును. అయితే, విజ్ఞాపన చేసికొనుటకు ఏ ప్రతివాదికైనను అవకాశము ఇచ్చిననే తప్ప అట్టి ప్రతివాదికి విరుద్ధముగా ఎట్టి ఉత్తరువులను జారీచేయరాదు.

(2) అట్టి నిర్ణయము లేక ఉత్తరువు విషయములో (1)వ సబ్ సెక్షను బట్టి తమకుగల అధికారములను వినియోగించనంతవరకు, ప్రభుత్వము అట్టి నిర్ణయము లేక ఉత్తరువుయొక్క అమలును ఆపుదల చేయవచ్చును.

(3) (1)వ సబ్ సెక్షను అనుసరించి జారీచేయబడిన ఉత్తరువు న్యాయశాస్త్ర సంబంధమైనట్టి లేక వాస్తవికాంశ సంబంధమైనట్టి ఏదైనా పొరపాటు వలన లేదా ఏదైనా ముఖ్యాంశము తెలిసియుండక పోయినందువలన ప్రభుత్వము వారిచే జారీ చేయబడి యుండినచో అది జారీ చేయబడిన తరువాత, ప్రభుత్వము వారు ఎప్పుడైనను స్వయముగా గాని లేదా ఆ ఉత్తరవు జారీచేయబడిన తరువాత 90 రోజులలో ఏ వ్యక్తియైనను, అర్జీ పెట్టుకొనిన మీదటగాని అట్టియే ఉత్తరవునైనను సమీక్షింపవచ్చును. (1)వ సబ్ సెక్షనుయొక్క మినహాయింపు నిబంధనలోను, (2) వ సబ్ సెక్షనులోనుగల నిబంధనలు, 1వ సబ్ సెక్షను ననుసరించి జరుపబడు ప్రొసీడింగులకు వర్తించు విధముననే ఈ సబ్ సెక్షన్ ననుసరించి జరుపబడు చర్యలకుకూడా వర్తించవలెను.

(4) ఈ సెక్షనుయొక్క (1)వ లేక (3)వ సబ్ సెక్షను క్రింద పెట్టుకొనబడు ప్రతి అర్జీ 15/– రూపాయల రుసుముతోసహా దాఖలు చేయబడవలెను.

ఇబ్బందులను తొలగించు అధికారము.

**73.** ప్రభుత్వము, ఈ చట్టపు నిబంధనలను అమలు జరుపుటలో ఏదైనా ఇబ్బంది సంభవించినచో, ఆ ఇబ్బందులను తొలగించుటకు తాము అవసరమని

తలచిన ఏ చర్యనైనను. ఆ సమయ అవసరములను బట్టి ఉత్తర్వులను జారీ చేయవచ్చును.

## తాత్కాలిక పంచాయతీ సమితుల సందర్భములలో మినహాయింపు

**74.** (1) ఏబ్లాకుకైనా ఈ చట్టము అమలులోనికి రాకపూర్వము ఒక పంచాయతీ సమితి, ప్రభుత్వ నిర్వాహక ఉత్తరువులద్వారా స్థాపింపబడియున్న (ఈ చట్టములో ఇటుతరువాత "తాత్కాలిక పంచాయతీ సమితి" అని పిలువబడినది) అది ఈ చట్టనిబంధల ప్రకారము ఈబ్లాకులో సక్రమముగా పంచాయతీ సమితి స్థాపింపబడిన తేదీనుండి దానిస్థితిని కోల్పోవలెను.

(2) ఆ తాత్కాలిక పంచాయతీ సమితిచే చేయబడిన అన్నిపనులు, తీసుకొనబడిన చర్యలును, ఈ చట్టముక్రింద దాని స్థానములో ఏర్పాటుచేయబడిన పంచాయితీ సమితిచే చేయబడినట్లు లేదా తీసుకొనబడినట్లు పరిగణింపబడవలెను. మరియు ఆ రోజున ఆ పంచాయతీ సమితికిగల అన్ని ఆస్తులు, అప్పులు, దానిస్థానే ఈ చట్టముక్రింద స్థాపింపబడిన పంచాయతీ సమతికి సంక్రమించవలెను.

## పంచాయతీ సమితియొక్క అధికారములు, కర్తవ్యములు, సమాజవికాసము.

**1.** పంచాయతీల, సహకార సంఘముల, స్వచ్ఛంధ సంస్థల మరియు ప్రజల సహకారముతో సమాజ వికాసమునకు సంబంధించిన కార్యక్రమములన్నియు నిర్వహించుట.

## వ్యవసాయము

**2.** వ్యవసాయోత్పత్తిని పెంచుటకు అవసరమైన ప్రతి పనిని విశేషించి యీదిగువ పనులుచేయుట,

(i) మేలిరకపు విత్తనములను ప్రోగుచేయుట మరియు పంపిణీ చేయుట,

(ii) వ్యవసాయక ఎరువుల పంపిణీ,

(iii) మేలిరకపు విధానములను, పద్ధతులను అలవాట్లను మరియు పనిముట్లను ప్రచారమునకు తెచ్చుట,

(iv) పచ్చ ఎరువులందు స్వయం సమృద్ధిని సాధించుట మరియు పెరటి ఎరువులను తయారుచేయుట,

(v) పండ్లు, కూరగాయల పెంపకము ప్రోత్సహించుట,

(vi) భూమిని పునరుద్ధారణము, భూసారరక్షణ;

(vii) వ్యవసాయ కార్యముల నిమిత్తము అప్పులు ఇచ్చుట,

(viii) మొక్కల సంరక్షణ పద్ధతులను ప్రచారము చేయుట మరియు ఆ పనులలో సహాయముచేయుట,

(ix) ప్రయోగపు పొలములను ప్రదర్శించి, ఉత్తమమైన నిర్వాహక పద్ధతులను రూపొందించుట,

(x) పాత బావులను బాగుచేసి, క్రొత్తబావులను త్రవ్వి, సొంత చెరువులను మరమ్మతు చేసిగాని, క్రొత్తగా త్రవ్విగాని, ప్రభుత్వపు చిన్ననీటిపారుదల పథకములను సరఫరా కాలువలను మంచి స్థితిలో ఉంచుచు అధికముగా భూమిని నీటివసరుల క్రిందికి తెచ్చుట,

(xi) వ్యవసాయోత్పత్తికి అధికముగా విద్యుచ్ఛక్తిని వినియోగించుట,

(xii) బావుల త్రవ్వకముద్వారా, ఫిల్టరు పాయింటులద్వారా, గొట్టపు బావులద్వారా భూగర్భములోని నీటి వనరులను ఉపయోగములోనికి తెచ్చుట,

(xiii) చెట్లు నాటుట,

(xiv) గ్రామ అడవులను పెంచుట,

పశుపోషణ మరియు మత్స్యసంవర్ధన.

3. (i) మంచిజాతి ఆబోతు కోడెలనుతెచ్చి, హీనజాతికోడెల విత్తులు తీసి స్థానిక పశుసంపదయొక్క శ్రేష్టతను పెంచుట,

(ii) పశువుల, గొర్రెల, పందుల, కోళ్ళ సంతానవృద్ధికై ఉత్తమ పద్ధతులను అవలంభించుట,

(iii) సరియైన రక్షణపద్ధతులనవలభించి, అంటువ్యాధులను అరికట్టుట.

(iv) మేలురకపు గడ్డిని, మేతలను ప్రవేశపెట్టుట.

(v) కృత్రిమ సంతానాభివృద్ధి కేంద్రములను, ప్రథమ చికిత్సా కేంద్రములను, చిన్నతరహా వైద్యశాలలను ఏర్పాటుచేయుట, మరియు నిర్వహించుట.

(vi) పాలు, పెరుగు తయారుచేయు కేంద్రములను తెరచుట, పాల సరఫరా.

(vii) మత్స్యసంవర్ధన పరిశ్రమ అభివృద్ధిచేయుట.

(xiii) పాలకొరకును, బరువుల లాగుటకొరకును మేలిరకపు పశువుల ప్రాముఖ్యతను గురించి ప్రజలకు బోధించుట.

ఆరోగ్యము, గ్రామ పరి శుభ్రత.

4. (i) ప్రస్తుతమున్న వైద్య, ఆరోగ్య సౌకర్యములను ఎక్కువచేయుట మరియు వాటిని ప్రజల అందుభాటులో ఉండునట్లు చేయుట

(ii) ప్రాథమిక ఆరోగ్య కేంద్రములను మరియు ప్రసూతి కేంద్రములను స్థాపించుట, నిర్వహించుట

(iii) త్రాగుటకు మంచినీటి సౌకర్యములు ఏర్పాటుచేయుట.

(iv) టీకాలు వేయించుటను క్రమ పద్ధతి ప్రకారము ఏర్పాటుచేయుట.

(v) ఉపద్రవకరమైన రోగములను నివారించుట,

(vi) గ్రామములలోని, ఇండ్లలోని మురుగుడు కొరకు, మురికి కాలువలను, మురికి గుంటలను ఏర్పాటుచేయుట,

(vii) శుభ్రమైన పాకీదొడ్లను వాడుటను, మలమును ఎరువుగా వాడుట ప్రోత్సహించుట,

(viii) పొగరాని పొయ్యిని ప్రచారమునకు తెచ్చుట,

(ix) ప్రభుత్వ ఆస్పత్రులయొక్క పనులపై పర్యవేక్షణ చేయుట,

(x) అట్టి ఆస్పత్రుల అభివృద్ధి పనులలో ప్రజలు పాల్గొనునట్లుచేయుట,

(xi) ఉపద్రవకరమైన రోగములు వ్యాపించిన సమయములలో ప్రజల యొక్క, పంచాయతీల యొక్క సహకారమును పొందుట,

(xii) పరిసర పారిశుద్ధ్య ఉద్యమములను కొనసాగించుట మరియు (ఎ) బలవర్ధకాహారము (బి) ప్రసూతి మరియు శిశు ఆరోగ్యము (సి) అంటువ్యాధులు (డి) కుటుంబ నియంత్రణ మున్నగు వాటిని గురించి ప్రజలకు బోధించుట,

(xiii) సంబంధించిన జిల్లా అధికారులయొక్క సాంకేతిక నియంత్రణకులోబడి ఆరోగ్య కార్య క్రమములను అమలు పరుచుట.

విద్య

5. ముఖ్యముగా ప్రాథమిక, బేసిక్ పాఠశాలలను ఈ క్రిందివాటిని అధికము చేయుట నిర్వహించుట.

(i) ప్రభుత్వముయొక్కయు, ప్రభుత్వము స్వాధీనపరచుకొన్నట్టియు ఎయిడెడ్ ఎలిమెంటరీ మరియు హైయరు ఎలిమెంటరీ పాఠశాలల ఏర్పాటు;

(ii) వయోజన విద్యా కేంద్రములను, వయోజన అక్షరాస్యతా కేంద్రములను, స్థాపించుట;

(iii) ప్రజాసహకారముతో పాఠశాల భవనములు అభివృద్ధిచేయుట మరియు ఏర్పాటుచేయుట;

(iv) ప్రస్తుతముయున్న ఎలిమెంటరీపాఠశాలలను, బేసిక్ పాఠశాలలుగా మార్పుచేయుట;

(v) 14 సంవత్సరములు పూర్తిచేయువరకు పిల్లల అందరియొక్క విద్యాభివృద్ధికొరకు అవసరమైన చర్యతీసుకొనుట.

## సాంఘిక విద్య

**6.** ప్రజలలో క్రొత్తదృక్పథము కలిగించుట మరియు వారిని స్వశక్తిపై అధార పడు వారిగను, కష్టించి పనిచేయువారిగను, సాముదాయక కార్యక్రమములలో పాల్గొనువారిగను తయారుచేయుట, ముఖ్యముగా ఈ క్రింది పనులను చేయుట,

(i) సమాచార కేంద్రములను, సాముదాయక కేంద్రములను, మనోల్లాస కేంద్రములను స్థాపించుట,

(ii) యువజన సంఘములు, మహిళామండలులను, కర్షకసమాజములను స్థాపించుట,

(iii) కాపలాదళములను వ్యవస్థీకరించుట.

(iv) వ్యాయామ కార్యకలాపములను,సాంస్కృతిక కార్యకలాపములను ప్రోత్సహించుట.

(v) గ్రామసహాయకులకు శిక్షణ యిచ్చుటకు మరియు వారి సేవలను ఉపయోగించుట.

## రాకపోకలు

**7.** (1) గ్రామము, గ్రామము మధ్యరోడ్లు నిర్మాణము, మరియు నిర్వహణ,

(2) పెద్ద రహదార్లకు కలుపబడే గ్రామ రోడ్ల నిర్మాణములో, నిర్వహణలో చేయదగ్గ సహాయము చేయుట.

## సహకారము

**8.** అనేక రూపముల సహకారపద్ధతులను అవలంభించి విశేషించి, దిగువవాటి ద్వారా ప్రజాస్వామ్య పద్ధతులలో ఆర్థికాభివృద్ధిని సాధించుట.

(i) సాధ్యమైనన్ని అధిక సంఖ్యాక కుటుంబములకు ఉపయోగకరముగా నుండుటకు పరపతి, పారిశ్రామిక, నీటి పారుదల, సేద్య మరియు బహుప్రయోజక సహకార సంఘములను స్థాపించుట.

(ii) మితవ్యయము మరియు చిన్న మొత్తము పొదుపును ప్రోత్సహించుట.

## కుటీర ప్రరిశ్రమలు

**9.** అధికతర ఉద్యోగావకాశములను కల్పించుటకు మరియు ప్రమాణమును పెంచుటకు కుటీర, గ్రామ, చిన్న తరహా పరిశ్రమలను అభివృద్ధి పరచుట-- ముఖ్యముగా యీ క్రిందిపనులను చేయుట,

(i) ఉత్పత్తి మరియు శిక్షణ కేంద్రములను స్థాపించుట మరియు నిర్వహించుట.

(ii) చేతి పనివాండ్ర యొక్కయు, కళాకారుల యొక్కయు నిపుణతను అభివృద్ధి పరచుట.

(iii) మేలిరకపు పనిముట్లను ప్రచారమునకు తెచ్చుట.

(iv) ఖాదీ మరియు గ్రామ పరిశ్రమల సంఘముచేత మరియు అఖిల భారత మండలులచేత ఆర్థిక సహాయముచేయబడిన కుటీర, గ్రామీణ మరియు చిన్నతరహా ప్రరిశ్రమల అభివృద్ధి పథకములను అమలు పరచుట.

## మహిళా సంక్షేమము

**10.** స్త్రీలయొక్కయు, పిల్లలయొక్కయు సంక్షేమముకొరకు ప్రత్యేకముగా ఉద్దేశింపబడిన పథకములను అమలు పరుచుట, విశేషించి మహిళా, శిశుసంక్షేమ కేంద్రములను, అక్షరాస్యతా కేంద్రములను, చేతిపని మరియు కుట్టుపని కేంద్రములను స్థాపించుట.

సాంఘిక సంక్షేమము

11. (i) షెడ్యూల్డు కులములయొక్కయు, షెడ్యూల్డు తెగలయొక్కయు, వెనుకబడిన తరగతులయొక్కయు, ఉపయోగార్థము, ప్రభుత్వముచే సహాయముచేయబడిన వసతి గృహముల నిర్వహణ.

(ii) గ్రామీణ, గృహనిర్మాణ పథకములను అమలు పరచుట.

(iii) వ్యాధి పీడిత భిక్షుకులను పోషించుట, తిరుగుబోతువాండ్రను అదుపులో పెట్టుట.

(iv) స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ సంస్థలను బలపరుచుట, మరియు వాటియొక్క పనులను సమన్వయ పరచుట.

(v) మద్య నిగ్రహమును, మద్యనిషేధమును ప్రచారముచేయుట.

ఆపత్కాల సహాయము :

12. అగ్నివలన, వరదవలన, ఉపద్రవకరమైన వ్యాధుల వలన మరియు ఇతర అరిష్టములవలన కలిగెడి విపత్తుల సందర్భములో స్వచ్ఛంద ప్రయత్నములద్వారా సహాయము చేయుటకు ఏర్పాటు చేయుట,

గణాంక వివరముల సేకరణ.

13. పంచాయతీ సమితికిగాని, జిల్లా పరిషత్తునకుగాని, ప్రభుత్వమునకుగాని, అవసరమైనట్టి గణాంక వివరములను సేకరించుట, క్రోడీకరించుట.

స్వయం సహాయ కార్యక్రమము.

14. ఉత్పత్తిని అధికముచేయుటకు, ఆదాయములను, జీవన ప్రమాణములను పెంచుటకు, పారిశుధ్యమును బాగుచేయుటకు, ప్రజలకు సదుపాయములు కలిగించుటకు యుక్తమగు కార్యక్రమములను రూపొందించుట మరియు అమలు పరచుట.

ట్రస్టులు.

15. పంచాయతీ సమితియొక్క నిధులను ఏకార్యముల నిమిత్తము వినియోగింపదగునో ఆకార్యములకు ఉద్దేశింపబడిన ట్రస్టుల నిర్వహణ.

మా వద్ద

గ్రంథాలయములకుపయుక్తమగు

పలురకముల గ్రంథములు లభించును.

ఉరుదు

పంచాయతీ సమితుల - జిల్లా పరిషత్తుల చట్టము

1959

వెల: రు. 1-25 న. పై.

జయ భారత్ బుక్ డిపో

ఆర్యసమాజ మందిర్ : సుల్తాన్ బజార్

హైదారాబాద్ - ఆంధ్ర ప్రదేశ్.